ISBN 81-237-0431-3

ప్రథమ ముద్రణ 1984 (శక 1905)

నాల్గవ ముద్రణ 1993 (శక 1914)



Gautama Buddha *(Telugu)*

రూ. 5.50

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్కు,
కొత్త ఢిల్లీ-110016 చే ప్రచురించబడినది.

నెహ్రూ బాల పుస్తకాలయం

# గౌతమ బుద్ధుడు

రచన
లీలా జార్జి

అనువాదం
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

బొమ్మలు
డి. ఎన్. బ్రహ్మ







నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# రాజకుమారుడు సిద్ధార్థుడు

రెండు వేల అయిదు వందల సంవత్సరాల క్రితం భారతదేశంలో హిమాలయ పర్వత ప్రాంతంలో శాక్యులు అనే ఒక తెగ ప్రజలు నివసిస్తూ ఉండేవారు. వాళ్ళ





ప్రభువు శుద్దోదన మహారాజు, ఆయన పట్టమహిషి మహామాయ. కనుల పండువైన కపిలవస్తుపురం వాళ్ళకు రాజధాని.

ఒక రాత్రి మహామాయకు చిత్రమైన కల వచ్చింది. నలుగురు రాజులు ఆమెను అందలం ఎక్కించి వెండి కొండమీద ఉన్న ఒక సరస్సు వద్దకు తీసుకు వెళ్ళారు. సరస్సులో ఆమెను స్నానంచేయించి, చీని చీనాంబరాలతోను, పువ్వులతోను అలంకరించారు. తరువాత ఒక దివ్య భవనంలో బంగారు పాన్పుమీద పడుకో బెట్టారు. తొండంలో కలువ పువ్వుతో ఒక ఏనుగువచ్చి, మూడుసార్లు ఆమెచుట్టూ ప్రదక్షిణం తిరిగి, తొండంతో ఆమె కడుపును నిమిరింది. త్వరలోనే మహామాయ కడుపున ఒక లోకోత్తర పురుషుడు జన్మించబోతున్నట్టు ఆ కల సూచిస్తూందని జ్యోతిశాస్త్ర పండితులు వ్యాఖ్యానించారు. అక్షరాలా వాళ్ళ జోస్యం నిజమైంది. మహామాయ గర్భవతి అయింది. ఆ తెగవారి ఆచారం ప్రకారం పురుడు పోసుకోవ డానికి ఆమె పుట్టింటికి బయలుదేరింది. కాని, దారిలోనే సాల వృక్షాలు (మద్ది చెట్లు) ఎక్కువగా ఉన్న లుంబినీ వనంలో ఆమె మగ శిశువును ప్రసవించింది.

వెంటనే వెనుకకు తిరిగి మహామాయ కపిలవస్తుపురం వచ్చింది. సంతోషంగా శుద్దోదన మహారాజు ఎదురు వచ్చాడు. రాజ్యం అంతటా వేడుకలు జరుపుకున్నారు.



తరువాత కొద్దిసేపటికే ఆ తల్లినీ, బిడ్డనూ చూడడానికి 'అసితుడు' అనే ఋషి వచ్చాడు. పుట్టి ఒక్కరోజూ కూడా నిండని పసికందును చేతులలోకి తీసుకుని ఆనందంతో-''ముందు ముందు ఇతడు మహా పురుషుడు అవుతాడు'' అంటూ, అంతలోనే కంటతడి పెట్టాడు.

శుద్ధోదన మహారాజు కలవర పడ్డారు. ''నా బిడ్డకు వచ్చిన ప్రమాదం ఏమీ లేదు గదా స్వామీ!'' అని ఆదుర్దాగా అడిగాడు.

''శిశువును గురించి కాదు నా విచారం!'' అన్నాడు అసితుడు. నన్ను గురించే నేను బాధ పడుతున్నాను. ఒకనాడు లోకానికంతటికీ ఈ శిశువు వెలుగుబాట చూపించ బోతున్నాడు. వృద్ధుణ్ణి అయిపోయిన నేను ఆ రోజును కళ్ళారా చూసేందుకు నోచుకోలేదే అని విచారిస్తున్నాను'' అంటూ అసితుడు వాపోయాడు.

అసితుని మాటలకు రాజ దంపతులు సంతోషపడ్డారు. కుమారునికి 'సిద్ధార్థుడు' అని పేరు పెట్టారు.

పురిట్లో ఏడవ రోజున మహామాయ మరణించింది. మహామాయ చెల్లెలూ, శుద్ధోదన మహారాజు రెండవ భార్యా అయిన 'ప్రజాపతి' కన్న బిడ్డలాగ సిద్ధార్థుణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసింది.

మహారాజు దేశంలో నాలుగు మూలలనుంచీ గొప్పగొప్ప విద్వాంసులను ఆహ్వానించాడు. "నా కుమారుని భవిష్యత్తు ఎలా ఉంటుందో చెప్పండి!" అని అడిగాడు.

అందరూ అసితుడు చెప్పిన మాట నిజమే అన్నారు. "నిస్సందేహంగా ఇతడు రాజాధిరాజు అవుతాడు. ప్రపంచ ప్రఖ్యాతి పొందుతాడు!"

"ఏ విధంగా?" అని అడిగాడు మహారాజు.

"ఇతడు ప్రపంచాన్నంతా జయిస్తాడు!" అన్నాడు ఒక పండితుడు.

"సన్న్యసించ కుండా సంసారంలో ఉంటే-" అని సవరించాడు మరో పండితుడు.

"ఇతడు జగద్విఖ్యాతి పొందిన మహా ప్రవక్త అవుతాడు!" అన్నాడు మూడో పండితుడు.

"సంసారం వదిలిపెట్టి, సన్న్యాసం స్వీకరిస్తే-" అని సవరించాడు నాలుగోవాడు.

తన బిడ్డ ప్రవక్త అయి ప్రపంచ ప్రఖ్యాతి పొందడం శుద్ధోదనునికి రుచించ లేదు. తన ఏకైక పుత్రుడు క్షత్రియ ధర్మం అవలంబించి ప్రపంచ విజేత కావడమే ఆయనకు ఇష్టం.

"ఈ రాజ కుమారుడు సన్న్యసించ కుండా ఉండాలంటే దుఃఖంగాని, వేదనగాని ఇతని కంట పడకుండా చూడండి." అని హెచ్చరించారు పండితులు.

ఎప్పుడూ సుఖ సంతోషాల మధ్య, అందమైన పరిసరాలలో కుమారుణ్ణి పెంచి పెద్ద చెయ్యాలని శుద్ధోదనుడు తీర్మానించుకున్నాడు. మూడు ప్రాసాదాలు కట్టించాడు. ఒకటి వేసవి మందిరం. చల్లని నీడనిచ్చే పెద్ద పెద్ద చెట్ల మధ్య ఉందది. రెండోది శీతాకాలం కోసం. ఎండ బాగా పడడానికి వీలుగా పెద్ద పెద్ద వరండాలు ఉన్న మందిరం అది. మూడోది వానాకాలం కోసం. ఇంట్లో ఆడుకునే ఆటలకు సంబంధించిన సరంజామా, పెద్ద పెద్ద గదులూ ఉన్నాయి. ఆ భవనంలో! అన్ని ప్రాసాదాల



చుట్టూ పూల తోటలూ, తామర కొలనులూ ఉన్నాయి. ఆరోగ్యంగానూ, యౌవనంలోనూ ఉన్నవారికి తప్ప ఇతరులను ఆ చాయలకు రానీయకుండా కాపలా వాళ్ళకు గట్టి ఉత్తరువులు ఇచ్చాడు మహారాజు.

ఈ ప్రాసాదాలలో భోగ భాగ్యాల మధ్య సిద్ధార్థుడు పెరుగుతున్నాడు. పట్టు బట్టలు తప్ప మరొకటి అతడు కట్టి ఎరుగడు. ఎండలో, వానలో, చలిలో ఎప్పుడూ బయటికే వెళ్ళలేదు. వందలాది పరిచారకులు అడుగులకు మడుగులొత్తుతూ సేవలు చేస్తున్నారు. అతని దాయాది దేవదత్తుడూ, మంత్రి కుమారుడు కలుదాయిన్ అతని సావాస గాళ్ళు. శాక్యులందరికీ యువరాజంటే ప్రాణం! 'గౌతమ' గోత్రికుడు కావడం వల్ల ప్రజలు అతన్ని 'గౌతముడు' అనేవారు.



ఒక రోజున తోటలో తిరుగుతూ ఉండగా సిద్ధార్థునికి ఆకాశంలో ఎగురుతున్న హంసల గుంపు కనిపించింది. చూస్తూ ఉండగానే ఎక్కడినుంచో రివ్వున ఒక బాణంవచ్చి తగిలి గిలగిల కొట్టుకుంటూ ఒక హంస సిద్ధార్థుని కాళ్ళ ముందు పడింది.

మెల్లిగా దానిని ఒడిలోకి తీసుకుని, బాణం లాగి వేసి, గాయానికి కట్టుకట్టి సిద్ధార్థుడు దాని ప్రాణం నిలబెట్టాడు. అంతలో దేవదత్తుడు వచ్చి, ఆ హంస తనదనీ, తన కిమ్మనీ అడిగాడు. దానిని ఇవ్వడానికి సిద్ధార్థుడు నిరాకరించాడు.

దేవదత్తుడు మహారాజుకి ఫిర్యాదు చేశాడు- “నేను బాణం వేసి పక్షిని కొట్టాను. నా పక్షిని నా కిమ్మంటే సిద్ధార్థుడు ఇవ్వడం లేదు.” అని.

శుద్ధోదనుడు సిద్ధార్థుణ్ణి అడిగాడు. దానిని సిద్ధార్థుడిలా బదులు చెప్పాడు. “నేను

ఆ హంస ప్రాణం కాపాడాను. దేవదత్తుడు దాని ప్రాణం తియ్యాలని చూశాడు. ఆ హంస ప్రాణం కాపాడిన వాడికే ఆ హంస దక్కాలి. ప్రాణుల్ని నాశనం చెయ్యాలని చూసిన వాడికంటె కాపాడిన వాడికే ఆ హంస చెందటం న్యాయం కాదా?"

ఆ వాదనలో ఉన్న బలం రాజును ఆకర్షించింది. సిద్ధార్థుణ్ణె ఆ హంసను ఉంచుకోమన్నాడు.

సిద్ధార్థునికి యుక్త వయస్సు రాగానే శుద్ధోదన మహారాజు దేశంలోని గొప్ప గొప్ప విద్వాంసులను రప్పించి అతనికి ఉపాధ్యాయులుగా నియమించాడు. సహజంగా చురుకైన వాడు కావడం వల్ల అతి వేగంగా అన్ని విద్యలూ నేర్చుకొన్నాడు. రాజ కుమారులు నేర్చుకోవలసిన మల్ల విద్య, ధనుర్విద్య మొదలైన వాటిలో కూడా అరి తేరాడు.

జాలి గుండె, సాధుస్వభావం గల సిద్ధార్థుడు క్రమంగా పెరిగి యువకుడు అయాడు. గానీ, జాలి ఉన్న వాడనీ, మంచీ, మర్యాదా తెలిసిన వాడనీ ప్రజల మెప్పును చూరగొన్నాడు. కుటుంబంలో ఏదో ఒక శుభ కార్యం సందర్భంలో ఒకసారి మేనమామ కూతురు యశోధరను చూసి అతడు మోహించాడు.

ఆ తెగవాల ఆచారం ప్రకారం యశోధర తండ్రి కుమార్తెకు తగిన వరుణ్ణి నిర్ణయించడానికి ధనుర్విద్యలో ఒక పోటీ ఏర్పాటు చేశాడు. ఆపోటీలో గెలుపొంది ఆమెను వివాహమాడాలని దేశ దేశాలనుంచీ రాజకుమారులు వచ్చారు. అందరూ బలంగా ఆరోగ్యంగా వున్నారు. వారితో పోలిస్తే సిద్ధార్థుడు అతి సుకుమారుడు. పోటీలో అతడు నెగ్గడం అసంభవం అని అందరూ అనుకున్నారు.

అయితే త్వరలోనే వాళ్ళు ఆ అభిప్రాయం మార్చుకోవాలసి వచ్చింది. పోటీలో సిద్ధార్థుడు ఇతరులతో సమ ఉజ్జీయే అని స్పష్టమైంది. వందలాది విల్లులు తెచ్చారు. వచ్చిన రాజకుమారులు అందరూ గురితప్పకుండా లక్ష్యాలను ఛేదిస్తున్నారు. ఎంత దూరాన ఉన్న గురి నైనా వెంట్రుకవాసి తేడా లేకుండా కొడుతున్నారు.

వారితో సమానంగా సిద్ధార్థుడు కుడా ఆ పనులన్నీ చేశాడు. చివరికి సిద్ధార్థుడు మిక్కిలి బరువైన పెద్ద విల్లు తెమ్మన్నాడు. 'సింహహనువు' అనే విల్లు ఒక గుడిలో ఉంది. ఇంతవరకు ఎవ్వరూ దానిని ఎక్కుపెట్ట లేకపోయారు. కొందరు పరిచారకులు వెళ్ళి దానిని మోసుకు వచ్చారు. జనం ఉత్సుకతతో చూస్తూ ఉండగా అవలీలగా సిద్ధార్థుడు దానిని పైకెత్తి వంచి నారి తగిలించాడు. బాణం ఎక్కుపెట్టి ఆకాశం లోకి వదిలాడు. పెద్ద మోతతో అది ఆకాశంలో కనిపించకుండా పోయింది.

దానితో రాజకుమారులు తమ ఓటమి ఒప్పుకున్నారు. ఒక్కొక్కరే మెల్లగా జారుకున్నారు. సిద్ధార్థుడు విజేత అని ప్రకటించారు. శుద్ధోదనుడు చాలా సంతోష పడ్డాడు. ఇక తన కొడుకు ప్రపంచ విజేత కావడం ఖాయం అనీ, అంత అందమైన యశోధరను వదలి అతడెన్నటికీ సన్న్యాసం పుచ్చుకోడనీ ఆయనకు నమ్మకం కుదిరింది.



# సత్యం కోసం అన్వేషణ

రూపవతి అయిన భార్యతో రాజ ప్రాసాదంలో సుఖంగా సిద్ధార్థుడు కాలం గడుపుతున్నాడు. కనులకింపైనవీ సంతోషకరమైనవీ మాత్రమే అతని కంటపడేట్టు శుద్ధోదనుడు ఏర్పాటు చేశాడు. ప్రపంచంలో దుఃఖం, బాధలూ ఉన్నాయని కూడా తెలియకుండా సిద్ధార్థుడు పెరిగాడు.

అయితే-తన ప్రాసాదానికి బయట విలక్షమైన ప్రపంచం ఉందని సిద్ధార్థునికి తెలుసు. ఆ ప్రపంచం ఎలా ఉంటుందో గదా అనుకునేవాడు. తరుచు ఒంటరిగా తోటలో ఒక ఏకాంత స్థలానికి పోయి గంటల తరబడి ఆలోచిస్తూ కూర్చునేవాడు.

ఒక రోజున-'బయటి ప్రపంచం ఎలా ఉంటుందో చూసి రావాలని ఉంది' అన్నాడు. శుద్ధోదనుడు అందుకు అభ్యంతరం చెప్పలేదు. ''మంచిదే! రేపు తాను పరిపాలించ బోయే దేశాన్నీ ప్రజలనూ రాకుమారుడు చూసిరావడం అవసరమే!'' అన్నాడు.

సిద్ధార్థుని నగర సందర్శనం సందర్భంలో వీధులన్నీ శుభ్రంచేసి అలంకరించ వలసిందని మహారాజు ఆజ్ఞ జారీ చేశాడు వీధులలో రాజకుమారునికి స్వాగతం చెప్పే తోరణాలు వెలిశాయి. ఇళ్ళన్నీ పూలతోనూ, పతాకాలతోనూ అలంకరించారు. రోగులూ ముసలి వారూ వీధులలో కనిపించ కూడదని చాటింపు వేశారు. ఏ విధమైన వేదనా కుమారునికి కంట పడకుండా మహారాజు అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాడు.

తెల్లగా మెరుస్తున్న నాలుగు గుర్రాలు లాగే రథం మీద సిద్ధార్థుడు బయలు దేరాడు. రథాన్ని చెన్నుడు తోలుతున్నాడు. నగర వీధుల గుండా మెల్లిగా రథం సాగింది. వీధుల కిరుప్రక్కలా బారులు తీర్చి నిలబడి ప్రేమగా ప్రజలు రాజకుమారునికి స్వాగతం చెప్పారు.

చేతులు జోడించి నమస్కరిస్తూ సిద్ధార్థుడు వారి అభినందనలు స్వీకరించాడు. ''ప్రజలంతా హాయిగా ఉన్నారు. నిజంగా ఈ లోకం ఆనందదాయమే!'' అనుకున్నాడు.

అయితే-ఇంకా విశేషాలు చూడాలనే కుతూహలం కలిగింది. ''ఆ వీధిలోకి రథం త్రిప్పు!'' అన్నాడు చెన్నుడితో. ఆ ప్రక్క వీధిలోకి చెన్నుడు రథం మళ్ళించాడు. సిద్ధార్థుడు ఆ వీధిలోకి వస్తాడని అక్కడ జనానికి తెలియదు' అక్కడ స్వాగతం తోరణాలు లేవు. వీధంతా దుమ్ము కొట్టుకొని జన సమ్మర్దంగా ఉంది. నడుం వంగిపోయిన ఒక ముసలివాడు కర్ర పోటు పొడుచుకుంటూ తూలుతూ వస్తున్నాడు.

''ఏఁవిటా రూపం?'' ఆశ్చర్యపోతూ అడిగాడు సిద్ధార్థుడు.

''వాడొక ముసలివాడు!'' అన్నాడు చెన్నుడు.

ప్రాసాదానికి తిరిగి వచ్చిన తరువాత చాలాసేపు సిద్ధార్థుడు విచారంగా ఉండిపోయాడు.



రూపవతి తన భార్య యశోధర కూడా ముసలిదై ఆ విధంగా తయారవుతుందా? తను కూడా ముసలివాడయి పోతాడా?''

ఈ సంగతి తెలిసిన శుద్ధోదనుడు అతని మనస్సును ఉల్లాస పరచడం కోసం నాట్య కత్తెలనూ, గాయకులనూ పంపించాడు. తాత్కాలికంగా వారు కృతకృత్యు లయినా, బయటి ప్రపంచాన్ని గూర్చిన ఆలోచనలు సిద్ధార్థుణ్ణి విడిచి పెట్టలేదు. ఆ ప్రపంచాన్ని గురించి ఇంకా వివరంగా తెలుసుకోవాలనిపించింది. అందుచేత-మరొక నగర సందర్శన యాత్ర ఏర్పాటు చేశారు.

పూర్వంలాగే ఉత్సాహంగా ప్రజలు సిద్ధార్థునికి స్వాగతం చెప్పారు. ''సందేహం లేదు-వీరంతా సంతోషంగా బ్రతుకుతున్నారు'' అనుకున్నాడు రాజకుమారుడు. కాని ప్రాసాదానికి తిరిగి వస్తూ ఉండగా నడవలేక బాధతో మెలికలు తిరిగిపోతున్న ఒక రోగి వారికి ఎదురయాడు. అతని ఒంటి నిండా కురుపులు, ఊరికే మూలుగుతున్నాడు.

''ఎందుకు ఆ మనిషి అలా దుఃఖిస్తున్నాడు?'' అని అడిగాడు రాజకుమారుడు.

''వాడికి జబ్బు!'' అన్నాడు చెన్నుడు.

అందరికీ జబ్బులు వస్తూ ఉంటాయని, ఆ బాధ అనుభవించక తప్పదనీ చెన్నుడు వివరించాడు. క్రమంగా ప్రపంచంలో ఉన్న దుఃఖం రాజకుమారుని కళ్ళ ముందు సాక్షాత్కరించడం మొదలు పెట్టింది.

ఇంకో రోజున రథం ఎక్కి నగరంలోకి వెళ్ళినప్పుడు శ్మశానానికి మోసుకు పోతున్న ఒక శవాన్ని ఆయన చూశాడు.

''ఆ మనిషిని వాళ్ళెక్కడికి తీసుకుపోతున్నారు?'' అని అడిగాడు.

''ఆ మనిషి చచ్చిపోయాడు. తగులబెట్టడానికి శ్మశానానికి తీసుకుపోతున్నారు'' అన్నాడు చెన్నుడు. ''పుట్టిన వాళ్ళంతా ఏదో ఒక రోజున చచ్చిపోక తప్పదు'' అని కూడా వివరించాడు.

''ముసలితనం, రోగం, చావు! నిజంగా లోకం ఎంత దుఃఖమయం!'' అనుకున్నాడు-జాలి గుండె గల ఆ రాజకుమారుడు. ఆయన మనస్సు కలత

చెందింది. లోకంలో ఇంత దుఃఖం, ఇంత వేదన ఎందుకు ఉన్నదీ తెలుసుకోవాలి_ అనుకున్నాడు.

మరోసారి నగరంలో ఆయన రథం మీద వెళుతున్నప్పుడు కాషాయ వస్త్రాలు ధరించిన ఒక సన్యాసి వారికి ఎదురయాడు. ఆయన చాలా ప్రశాంతంగా ఉన్నట్టు కనిపించాడు.

"ఎవ రాయన?" ఆసక్తిగా అడిగాడు సిద్ధార్థుడు.

"ఒక సాధువు!" చెప్పాడు చెన్నుడు. "సంసారం నుంచి ఆయన సన్న్యసించాడు. ప్రపంచంలో దుఃఖాలకూ, బాధలకూ ఆయన అతీతుడు. ప్రశాంత చిత్తంతో శాశ్వత సత్యాన్ని ఆయన అన్వేషిస్తున్నాడు." ఈ మాటలవల్ల సిద్ధార్థునికి కొంత ఆశ కలిగింది. తనుకూడా ఆయనలాగ ఉండాలనుకున్నాడు. తనుకూడా సంసారాన్ని వదలిపెట్టి సన్న్యసించాలని తీర్మానించుకున్నాడు.

ఈ సంగతులన్నీ అతి గాఢంగా ఆయనను కలవర పెడుతూ ఉండగా, అంతలో ఆయనకు కుమారుడు కలిగాడు. 'రాహులుడు' అని ఆబిడ్డకు పేరు పెట్టారు.





సుకుమారుడు కలిగాడని సంతోషపడే సమయంలో కూడా సిద్ధార్థుణ్ణి తీవ్రమైన అశాంతి వదలలేదు. తన ధ్యేయం నుంచి తాను వైదొలగకూడ దనుకున్నాడు. ఇక ఏమాత్రం ఆలస్యం చెయ్య కుండా సంసారం నుంచి సన్న్యసించాలని నిశ్చయించు కున్నాడు.

సిద్ధార్థుని వయస్సు అప్పుడు 29 ఏళ్ళు. ఒక అర్ధరాత్రి వేళ నిద్ర లేచాడు. భార్య యశోధర రాహులుని మీద చేయి వేసుకుని గాఢ నిద్రలో మునిగి ఉంది. చివరిసారిగా సిద్ధార్థుడు కొడుకును ఆప్యాయంగా చేతులలోకి తీసుకుందామను కున్నాడు

కాని భార్యకు మెలకువ వస్తుందేమో అని సందేహించాడు. వెనుకకు తిరిగి చూడకుండా వడి వడిగా నడుస్తూ రాజ ప్రాసాదం నుంచి బయటికి వచ్చాడు.

విశ్వాస పాత్రుడైన చెన్నుడు తన వెంటరాగా ఒక అడవిలో ఆయన ప్రవేశించాడు. తన జుట్టు కత్తిరించి, తను సాధువుగా మారినట్టు గురుతుగా ఆ జుట్టును చెన్నునిచేత రాజప్రాసాదానికి పంపించాడు. రాజకుమారుని దుస్తులు తీసివేసి, సన్న్యాసులు వేసుకునే అంగరఖా ధరించాడు. సత్యాన్ని అన్వేషిస్తూ బయలు దేరాడు.

సిద్ధార్థుడు శాక్యముని అయాడు. అక్కడా,అక్కడా తిరుగుతూ చివరికి సుప్రసిద్ధమైన వైశాలీ నగరం చేరుకున్నాడు. జీవితాన్ని గురించిన వాస్తవం తెలుసుకునేందుకు అక్కడ 'అలర కలుమ' అనే తత్త్వవేత్త ఆశ్రమంలో కొంతకాలం ఉన్నాడు. వేరువేరు దర్శనాలు అధ్యయనం చేశాడు. కాని, వాటిలో ఏదీ ఆయన ప్రశ్నలకు సరిఅయిన జవాబులు చెప్పలేకపోయింది.

ఆ తరువాత–ఆ రోజులలో మిక్కిలి బలంగా ఉన్న మగధరాజ్యం రాజధాని రాజగృహానికి వచ్చాడు. అక్కడ ఉద్రకుడు అనే పండితుడు నడుపుతున్న పాఠశాలలో చేరాడు. ఉద్రకుని అపార పాండిత్యం గౌతముణ్ణి ఆకర్షించింది. కాని, త్వరలోనే- పాండిత్యంవల్ల సత్యం బోధ పడదని ఆయన గుర్తించాడు. తన అన్వేషణ కొనసాగించడం కోసం ఆ పాఠశాల వదలి వెళ్ళిపోయాడు.

కఠోరమైన తపస్సు చేస్తే సత్యం బోధపడుతుందా? ప్రాచీన భారతీయ మహర్షులు అవలంబించిన ఆ మార్గంలో ప్రయత్నించి చూడాలని గౌతముడు అనుకున్నాడు. అయిదుగురు సన్న్యాసులు అతని దగ్గిర శిష్యులుగా చేరారు. ఆ అయిదుగురు శిష్యులతో సహా అతడు ఒక అడవిలోకి పోయి, తపస్సు ప్రారంభించాడు. ఎన్నో విధాలుగా తన శరీరాన్ని శుష్కింప జేశాడు. ఉపవాసాలు చేసిచేసి, ప్రాణం పోయినంతపని అయింది. అయినా ఆయనకు కను చూపు మేరలో ఎక్కడా సత్యం కనిపించలేదు. దానితో–కఠోరమైన తపస్సు నిరర్థకం అనే నిశ్చయానికివచ్చి తపస్సుకు



ఆయన స్వస్తి చెప్పారు. అది చూసి, ఆయన మళ్ళీ సంసార కూపంలో పడబో తున్నారని భావించి ఆ అయిదుగురు శిష్యులూ ఆయనను వదలి వెళ్ళిపోయారు.

దగ్గిరలో ఉన్న 'నిరంజన' అనే నదిలో సిద్ధార్థుడు స్నానం చేశాడు. బాగా నీరస పడిపోయినందువల్ల ప్రవాహంలో ఇంచుమించు కొట్టుకు పోయినంత పని అయింది. ఎలాగో కష్టంమీద ఒడ్డు చేరుకున్నాడు. ఆ సమీపంలో నివసించే 'సుజాత' అనే యువతి ఆయనకు ఒక గిన్నెలో పాయసం తెచ్చిపెట్టింది అది తిన్న తరువాత ఆయనకు ప్రాణం వచ్చింది.

చివరకు సిద్ధార్థుడు 'తీవ్రమైన ధ్యానమే సత్యాన్ని తెలుసు కోవడానికి సరి అయిన మార్గం' అనే నిర్ణయానికి వచ్చాడు. గయ నగరపు పొలిమేరలలో అంద మైన చోటు చూసుకుని ఒక రావిచెట్టు క్రింద పద్మాసనం వేసుకుని కూచున్నాడు. ''సత్యం బోధపడే దాకా నేను ఇక్కడినుంచి కదలను'' అని శపథం పట్టాడు.

ఆ విధంగా ధ్యానంలో మునిగి ఉన్న సిద్ధార్థుడు తన ధ్యానానికి భంగం కలిగించే అనేక ఆకర్షణలను ఎదుర్కోవలసి వచ్చినట్టు చెబుతున్నారు. మారుడు అనే రాక్షసుడు-సిద్ధార్థునికి సత్యం బోధపడినట్లయితే ఆయన దానిని ప్రపంచానికంతటికీ చాటుతాడే అని భయపడ్డాడు. ఆ పని జరిగితే మారునికి ఇక లోకంలో ఆస్కారం లేకుండా పోతుంది.

అందుచేత-ముందుగా సిద్ధార్థునికి తన రాజ ప్రాసాదాన్నీ, భార్య యశోధరనీ, చిన్నారి బిడ్డ రాహులుణ్ణీ చూపించ అతణ్ణి భ్రమింత జెయ్యాలని మారుడు ప్రయత్నించాడు కాని, భ్రాంతికి లోనుకాకుండా సిద్ధార్థుడు అలాగే తన ధ్యానం కొనసాగిస్తున్నాడు. తరువాత మారుడు అతని దృష్టిని చెదరగొట్టటానికి తీవ్రమైన తుఫానులనూ, సుడిగాలులనూ సృష్టించాడు. అయినా - ఆ ముని సంకల్పబలం రవ్వంతయినా చలించలేదు. చిట్ట చివరి అస్త్రంగా మారుడు 'కోరిక', 'సుఖం', 'కామం' అనే తన ముగ్గురు కుమార్తెలను సిద్ధార్థుని ముందు నాట్యం చేసి ఆయన దృష్టిని మళ్ళించ వలసినదని పంపించాడు. కాని వారుకూడా అతని ధ్యానానికి భంగం కలిగించ లేకపోయారు. గాఢమైన ఆయన ధ్యానం నిర్విఘ్నంగా కొనసాగింది.

నలభై తొమ్మిదో రోజున చివరికి ఆయనకు సత్యం బోధపడింది. ఆయన 'బుద్ధుడు' అయాడు. సిద్ధార్థునికి జ్ఞానోదయం అయిన ఆ చెట్టే అనంతరం 'బోధి వృక్షం'గా ప్రసిద్ధి పొందింది.

# ధర్మపథం

జ్ఞానోదయం అయి, 'బుద్ధుడు' అయిన సిద్ధార్థుడు తాను దర్శించిన సత్యాన్ని ప్రజలకు బోధించాలనుకున్నాడు. లోకం అజ్ఞానంలో హింసలో తల మున్కలుగా ఉంది. ఆ సంగతి ఆయనకు తెలుసు. "తన మాటలను ఈ లోకం పట్టించుకుంటుందా?" అని ఆయన సందేహించారు. తల పెట్టిన కార్యం కఠిన మైందని ఆయనకు తెలుసు. అయినా మానవ జాతిపట్ల తనకుగల అపారమైన కరుణ వలన ఆయన వెనుకంజ వేయలేము.

అయితే-తన భావాలను ప్రజలలో ప్రచారం చెయ్యాలంటే విశ్వాసపాత్రులయిన అనుచరులు కొందరు తనకుకావాలి।

మొట్ట మొదట ఆయనకు గుర్తువచ్చినవారు. వారణాసి సమీపంలోని సారనాథ్ వద్ద తన గురుత్వం మాని స్వతంత్రంగా తపస్సు కొనిసాగిస్తున్న తన వెనుకటి శిష్యులు. అందుచేత-కరుణార్ద్ర హృదయుడైన బుద్ధుడు ముందుగా సారనాథ్ వెళ్ళాడు.

దూరం నుంచే ఆ శిష్యులు బుద్ధుడు రావడం చూశారు. "అదిగో! మన వెనుకటి గురువు గౌతముడు వస్తున్నాడు" అన్నాడు వారిలో ఒకడు.

"తపస్సు మాని తిరిగి సంసారంలో అడుగుపెట్టిన గురువు!" అన్నాడు వెటకారంగా మరొకడు.

"కాని, ఇంకా ఆయన సన్న్యాసి దుస్తులలోనే ఉన్నారే?" అన్నాడు మూడవ వాడు.

"అయినా సరే-మనం ఆయనకు నమస్కారం చెయ్యవద్దు!" అని తీర్మానించుకున్నారు వారు.

కాని, తీరా బుద్ధుడు సమీపించేసరికి మహా వర్చస్సుతో ఆయన ప్రకాశిస్తూ ఉండడం వారు చూశారు. ఒక మహాపురుషుని సమక్షంలో ఉన్నట్టు వారికి కనిపించింది. ఆయన బోధలను వినడానికి వారు సిద్ధపడ్డారు. బుద్ధుడు తన మొట్ట మొదటి ప్రబోధ ప్రసంగం ఆ అయిదుగురు శిష్యులనూ ఉద్దేశించి చేశాడు.

"రెండు 'చివర' లనూ పరిహరించండి" అనే ఉద్బోధనతో ఆ ప్రసంగం ఆరంభం-అయింది. భోగాలతో, విలాసాలతో జీవించడం ఎంత అనుచితమో, తీవ్రమైన తపస్సుకు పూనుకుని శరీరాన్ని శుష్కింపచేసుకోడంకూడా అంత అనుచితమే అని ఆయన అన్నారు. 'మాధ్యమిక' మార్గం అవలంబించడం శ్రేయస్కరం. అప్పుడే జీవిత వాస్తవ స్వరూపాన్ని దర్శించి సత్యాన్ని గుర్తించగలుగుతారు.

బుద్ధుడు బోధించిన మొట్టమొదటి అంశం: 'ఈ లోకం దుఃఖ భూయిష్టమైంది' అని రెండోది ఈ దుఃఖానికి ఒక కారణం ఉంది' మూడోది. 'దుఃఖం నుంచి విముక్తి పొందాలంటే ఆ కారణాన్ని నిర్మూలించాలి' నాలుగోది, 'అష్టాంగాలతో కూడిన ధర్మ పథాన్ని అనుసరించడం వల్లనే అది సాధ్యం అవుతుంది। సారనాథ్‌లో చేసిన తొలి ప్రబోధ ప్రసంగంలో బుద్ధుడు చెప్పిన ఈ నాలుగు సత్యాలే బౌద్ధమతం లోని 'నాలుగు ప్రధాన సత్యాలు'గా ప్రసిద్ధి పొందాయి.



బుద్ధుడు బోధించిన అష్టాంగ మార్గంలోని ఎనిమిది అంశాలు. సమ్యక్ దృష్టి, సమ్యక్ వాంఛ. సమ్యక్ వాక్కు, సమ్యక్ వర్తన, సమ్యక్ జీవనం, సమ్యక్ ప్రయత్నం, సమ్యగాలోచన, సమ్యక్ ధ్యానం, ఇదే ధర్మపథం। ప్రజలందరూ ఈ పథాన్ని అవలంబిస్తేవారు దుఃఖంనుంచి విముక్తి పొందగలరని బుద్ధుడు బోధించాడు.

బుద్ధుని బోధనలు చాలా సరళమైనవి. అందరికీ అర్థం అయ్యేవి. కర్మ సిద్ధాంతాన్ని బుద్ధుడు విశ్వసించారు. దాని ప్రకారం మనుష్యుని ఆత్మనశించదు. చని పోయిన తరువాత మనిషి మళ్ళీ జన్మ ఎత్తుతాడు. ప్రతి జన్మలోనూ క్రిందటి జన్మలో చేసిన కర్మల ఫలితాలను అనుభవిస్తాడు.

జీవిత చరమ ధ్యేయం: నిర్వాణం, జనన మరణ చక్రం నుంచి విముక్తి పొందడం. బుద్ధుడు బోధించిన మాధ్యమిక మార్గాన్ని అనుసరిస్తూ సత్కార్యాలు చేస్తూ జీవించడంవల్ల నిర్వాణం సాధించవచ్చు!

అహింసా మార్గాన్ని బోధించిన మహా ప్రవక్త బుద్ధుడు. ఆయన దృష్టిలో ప్రాణం పవిత్రమైంది. తనని అనుసరించేవారు ప్రాణి వధ చేయరాదని ఆయన నియమం చేశారు. 'వధ' అంటే అక్షరాలా 'చంపడం' అని మాత్రమే అర్థంకాదు. మాటల ద్వారా, చేతల ద్వారా పెట్టే ఎలాంటి హింస అయినా 'వధ' క్రిందికే వస్తుంది.

మనిషి ఎక్కవలసిన మొదటి మెట్టు 'ఆత్మ సంయమం' సాధించడం. ఆత్మ సంయమం లేకపోతే మంచిగా జీవించడం సాధ్యంకాదు. బుద్ధుడు ఇలాగా అంటారు. మేల్కొన వలసిన సమయంలో మేల్కోని వాడూ, యౌవనంలో బలంగా ఉండి కూడా సోమరిగా గడిపేవాడూ, సంకల్పం, ఆలోచన దుర్బలంగా ఉండేవాడూ ఎన్నటికీ జ్ఞానమార్గం తెలుసుకోలేడు.''

'జీవ కారుణ్యం' అత్యుత్తమ ధర్మంగా బుద్ధుడు భావించారు. బాల్యంలోనే గాయపడిన పక్షిని చూసినప్పుడు ఆయనలోని కారుణ్యం పెల్లుబికింది. ఆయన ఇలా అన్నారు. ''తన ఒక్కగానొక్క బిడ్డమీద తల్లి ఎంత ప్రేమ ప్రదర్శిస్తుందో, ప్రతి మనిషి తోటి జీవకోటి అంటటి మీదా అంత ప్రేమ చూపించాలి!''

'ప్రేమ' అన్నిటినీ జయిస్తుంది. 'హింసను' అహింస'తో ఎదుర్కోవాలి. అలాగే 'ద్వేషాన్ని' 'ప్రేమ'తో ఎదుర్కోవాలి. ''ఈ లోకంలో ద్వేషం వల్ల ద్వేషం ఎప్పుడూ నశించదు. ప్రేమ వల్లనే ద్వేషం ఉపశమిస్తుంది.

# సంఘ స్థాపన

సారనాథ్‌లో బుద్ధుడు చేసిన ప్రసంగం విని వెనుకటి శిష్యులు అయిదుగురూ ఆయన అనుయాయులు అయారు. వారే బౌద్ధ సంఘంలో మొదటి ''భిక్కులు'' క్రమంగా బుద్ధుని బోధనలు వ్యాపించిన కొద్దీ ఎందరెందరో ఆ సంఘంలో చేరారు.

ఆ రోజులలో వారణాసిలో 'యశుడు' అనే ఒక ధనిక యువకుడుండేవాడు. అతనికి జీవితం మీద విరక్తి పుట్టింది. ఒక రోజున ఇల్లు వదలి ఏ గమ్యమూ లేకుండా దారినపడి పోతున్నాడు. అదృష్టవశాత్తు బుద్ధుణ్ణి అతడు కలుసుకున్నాడు. అసాధారణమైన ఆయన వ్యక్తిత్వం అతణ్ణి ఆకర్షించింది. 'ధర్మపథం' అనుసరించమని బుద్ధుడు అతనికి ఉపదేశించాడు. అతడు దీక్ష పుచ్చుకుని బౌద్ధ సంఘంలో చేరాడు.

యశుణ్ణి వెతుక్కుంటూ అతని తండ్రి బయలుదేరాడు. ఆయన కూడా బుద్ధుణి కలుసుకోగానే ఆయన శిష్యుడయ్యాడు. అయితే ఆయన సంసారాన్ని వదలిపెట్టలేదు. సంసారంలో ఉంటూనే లౌకిక శిష్యుడయాడు. తరువాత బుద్ధుడు యశుని ఇంటికి వెళ్ళి అతని తల్లికీ, భార్యకూ కూడా ధర్మపథాన్ని బోధించాడు. వారుకూడా ఆయన శిష్యకోటిలో చేరారు.

తన అనుయాయులందరూ సన్న్యాసులు, భిక్కులో, భిక్కునులో అయితీరాలని బుద్ధుడు పట్టుపట్టలేదు. కొద్దిమందికి మాత్రమే సంసారమంటే పూర్తిగా విరక్తి పుట్టి సన్న్యసించే ప్రవృత్తి ఉంటుంది. ప్రజలలో ఎక్కువ మంది తాను బోధించే నీతి మార్గాన్ని అనుసరిస్తూ సాధారణ జీవితాలు గడపాలనే ఆయన కోరాడు. అలాంటి వారు ఆయనకు లౌకిక శిష్యులు. సంఘాన్నీ బుద్ధుణ్ణీ, ధర్మాన్నీ వారు శరణు వేడాలి.

బౌద్ధ సంఘం అభివృద్ధికి బుద్ధుడు గట్టి కృషి చేశాడు. తన బోధలను మానవ జాతి కంతటికీ అందజేయగల సుశిక్షితులైన భిక్కుల సంఘంగా దాన్ని తీర్చిదిద్దాడు.

చాలామంది సన్న్యాసులను కలుసుకొని, బుద్ధుడు వారిని తన మాధ్యమిక మార్గానికి మళ్ళించాడు. అలా మారిన తొలి శిష్యులలో ఒకడు అగ్ని ఆరాధకుడైన బ్రాహ్మణ పురోహితుడు- కాశ్యపుడు. ఈయనే అటు తరువాత మహా కాశ్యపుడుగా ప్రసిద్ధి పొంది, బుద్ధుని అనంతరం బౌద్ధ సంఘానికి అధిపతి అయాడు.

కాశ్యపునితోపాటు ఆయన శిష్యులు 500 మంది కూడా బౌద్ధ సంఘంలో చేరారు. అనంతరం కాశ్యపుని సోదరులు కూడా ఇద్దరు 300 మందీ, 200 మందీ శిష్యులతో

సహా బౌద్ధ సంఘంలో చేరారు. క్రమంగా సంఘం పెరిగి, మహా ప్రవక్త అయిన బుద్ధుని కీర్తి దేశం అంతటా వ్యాపించింది.

తరువాత కొద్ది కాలానికే బుద్ధుడు సపరివారంగా మగధ దేశపు రాజధాని రాజగృహం వెళ్ళాడు. అప్పుడు మగధ దేశపు రాజు బింబిసారుడు. బుద్ధుని ఆగమనాన్ని గురించి వినగానే సామంతులతో సహా ఆయన ఎదురువచ్చి ఘనంగా ఆ మహనీయునికి స్వాగతం చెప్పాడు.

అందరినీ ప్రేమగా పలుకరించి బుద్ధుడు వారికి ధర్మపథాన్ని ఉపదేశించాడు. బింబిసారుడూ, ఆయన సామంతులూ అనుయాయులు అయారు. ఆయన బోధలను ముగ్ధుడైన ఆ రాజు ఇలా ప్రకటించాడు. "ఇప్పుడు ఇంక నాకు ఏమీ కొదువలేదు. నా రాజ్యం కన్న కూడా ఎక్కువ విలువైన బుద్ధుని బోధనలు నాకు లభించాయి." బుద్ధుణ్ణి ఆయన ఇలా ప్రార్థించాడు. "మహా మునీ! సపరివారంగా తాము నా ప్రాసాదానికి వచ్చి నా భిక్ష స్వీకరిస్తే అది మహా భాగ్యంగా నేను పరిగణిస్తాను." ఆయన ఆహ్వానాన్ని బుద్ధుడు అంగీకరించాడు.

విందుకోసం బింబిసారుడు బ్రహ్మాండమైన ఏర్పాటు చేశాడు. బుద్ధుడూ ఆయన పరివారం వచ్చే మార్గంలో నగరవీధులలో స్వాగతం తోరణాలు పెట్టించాడు. ప్రాసాద ద్వారంవద్దనే ఎదురువచ్చి గౌరవంగా వారిని లోపలికి తీసుకువెళ్ళాడు. అందంగా అలంకరించిన పెద్ద హాలులో ఒక ఉన్నతాసనం మీద బుద్ధుణ్ణి ఆసీనుణ్ణి చేసి తాను స్వయంగా ఆయనకు వడ్డించాడు.

విందు ముగిసిన తరువాత రాజు ఇలా అన్నాడు: "నా భక్తికి చిహ్నంగా శాక్యమునికి నేను 'వేలు' వనం కానుకగా అర్పించుకుంటున్నాను. నా ఈ చిన్న కానుకను స్వీకరించవలసిందని కోరుతున్నాను."

బుద్ధుడు ఆ కానుకను అంగీకరించాడు. రాజగృహం పొలిమేరలో ఉన్న 'వేలు' వనంలో మొదటి బౌద్ధ విహారాన్ని బుద్ధుడు ఏర్పాటు చేశాడు. తనకూ, బౌద్ధ భిక్షువులకూ ధ్యానానికీ, అధ్యయనానికి, ఉపయోగించే కేంద్రాలు విహారాలు.

ఆ రోజులలో సన్న్యాసులలో-వారు ఏ మత శాఖకు చెందిన వారైనా వర్షా కాలంలో దేశాటన చెయ్యకుండా స్థిరంగా ఒకచోట ఉండాలనే నియమం ఉండేది. ఆ నాలుగు నెలలూ ఒక ఆశ్రమంలోనో, ఆలయంలోనో వారు గడుపుతారు. దీనినే 'చాతుర్మాస్యవ్రతం' అంటారు. బౌద్ధ భిక్కులు ఈ వ్రత కాలాన్ని విహారాలలో గడిపేవారు.



బుద్ధుడు రాజగృహం వచ్చిన ఆ సందర్భంలోనే-అనంతరం సుప్రసిద్ధ బౌద్ధ భిక్కులైన సారిపుత్రుడూ, మొగ్గలాయనుడూ బౌద్ధ సంఘంలో చేరడం జరిగింది. బుద్ధుని అనుయాయులు కావడానికి ముందు వారు సన్న్యసించి దేశాటనం చేస్తూ

ఉండేవారు. వాళ్ళిద్దరూ బాల్యమిత్రులు. సంసారం వదలి పరివ్రాజకులై సత్యాన్వేషణ చేస్తున్నవారు. వారిలో ఎవరికి ముందు జ్ఞానోదయం అయినా, ఆ జ్ఞానాన్ని రెండవ వారికి తెలియజెయ్యాలని వారి ఒప్పందం।

ఒక రోజున సారిపుత్రుడు దేశాటనం చేస్తూ బుద్ధుని తొలి అయిదుగురు శిష్యులలో ఒకడైన అస్సాజీని కలుసుకున్నాడు. ఆయనలోని ఉదాత్తను చూసి సారిపుత్రుడు



ముగ్ధుడయాడు. "మీ గురువు ఎవరు అన్నా। ఎవరి ఉపదేశాలను నీవు అనుసరిస్తున్నావు?" అని ప్రశ్నించాడు.

"శాక్యముని బోధలను నేను అనుసరిస్తున్నాను" అన్నాడు అస్సాజీ।

"ఆయన బోధల సారాంశం ఏమిటి?"

అప్పాజీ అతనికి బుద్ధ భగవానుడు బోధించిన ధర్మపధాన్ని ఉపదేశించాడు.

"నేను అన్వేషిస్తున్న సత్యం సరిగ్గా ఇదే!" అన్నాడు సారిపుత్రుడు.

వెంటనే వెళ్ళి తన మిత్రుడు మొగ్గలాయనకు అతడు ఆ సత్యం బోధించాడు. ఇద్దరూ బుద్ధ భగవానుణ్ని సందర్శించి బౌద్ధ సంఘంలో చేరారు.



# పునరాగమనం

బుద్ధునికి జ్ఞానోదయం అయిన కొద్ది సంవత్సరాలలోనే ఆయన ప్రఖ్యాతి ఆయన ముసలి తండ్రి చెవులదాకా ప్రాకింది. శుద్ధోదనునకు తన కుమారుడు సన్న్యసించడం ఇంకా బాధాకరంగానే ఉంది. ఒక్కసారి అతడు తిరిగి కపిలవస్తుపురం వచ్చి కొన్నాళ్ళయినా ఉండి వెళితే బాగుండును-అనుకున్నాడు ఆయన. తన ఒక్కగానొక్క కొడుకైన సిద్ధార్థుడు మళ్ళీ తన రాజ్యానికి తిరిగి వస్తాడనీ, శాక్య ప్రజల నాయకుడుగా తన బాధ్యతను నిర్వర్తిస్తాడనీ ఆశ ఆయనకు ఇంకా వదల లేదు.

రాజగృహంలో బుద్ధుడు మత బోధ చేస్తున్నాడని విన్న శుద్ధోదనుడు బుద్ధుణ్ణి కపిలవస్తుపురం ఆహ్వానించడానికి వెయ్యమంది సైనికులతో తన మంత్రులలో ఒకణ్ణి పంపించాడు. ఒక పెద్ద జన సమూహానికి బుద్ధుడు మతబోధ చేస్తూ ఉన్న సమయంలో ఆ మంత్రీ, అతని పరివారం అక్కడికి వెళ్ళారు. గుంపులో కలిసి వారు కూడా ప్రవక్త ప్రసంగం విన్నారు. అయన ఉపదేశానికి ముగ్ధులైనవారు వెంటనే సన్న్యసించి మతదీక్ష స్వీకరించారు. సంసారంతో సంబంధం తెగిపోవడంతో తాము వచ్చిన పనివారు మరచిపోయారు. శుద్ధోదనుని ఆహ్వానం శాక్యమునికి అందనేలేదు.

అనంతరం-శుద్ధోదనుడు సిద్ధార్థుని బాల్యమిత్రుడు కలదాయిన్‌ని పంపాడు. బుద్ధుని బోధలు విని కలుదాయన్ కూడా పరివ్రాజకుడయాడు. అయితే- తాను రాజుకి చేసిన వాగ్దానం అతడు మరచిపోలేదు. ఒక రోజున బుద్ధుడు ఒక ఆరామంలో విశ్రమించి ఉండగా కలదాయిన్ మెల్లగా ఆయనను సమీపించి ఇలా అన్నాడు. 'భగవాన్ మీ తండ్రీ, పిన తల్లి ప్రజాపతీ, భార్య యశోదరా మిమ్మల్ని తిరిగి చూడాలని కలవరిస్తున్నారు. మిమ్మల్ని ఆహ్వానించడం కోసమే ప్రత్యేకంగా రాజుగారు ఇక్కడికి పంపారు.''

ఆ మాటలతో బుద్ధునికి తాను వెనుక వదలి వచ్చిన అనుబంధాలు గుర్తు వచ్చాయి. తాను కనుగొన్న ధర్మపథాన్ని వారికి ఉపదేశించడంకోసం అయినా వారిని చూసిరావాలని బయలుదేరాడు. ఆయన రాకనుగూర్చి శుద్ధోదనునికి చెప్పడానికి కలుదాయిన్ ముందుగా వెళ్ళాడు.

కుమారునికి స్వాగతం చెప్పేందుకు మంత్రి సామంత్రులతో సహా శుద్ధోదనుడు ఎదురువచ్చాడు. బుద్ధుణ్ణి చూడగానే ఆయన కాంతీ, వర్చస్సూ మహారాజును ఆకట్టుకున్నాయి. కొడుకుని కౌగిలించుకొని ఇలా అన్నారు. ''ఇంకనేను దుఃఖించను నాయనా! సర్వమానవ జాతినీ ఉద్ధరించే ఉత్తమ పథం కనిపెట్టావు నువ్వు!''

ఇల్లూ, వాకిలీ సన్న్యాసం స్వీకరించిన వారు గనుక బుద్ధుడూ, ఆయన పరివారం

రాజప్రాసాదంలో విడిది చేయలేదు. వారికోసం శుద్ధోదనుడు నగరానికి సమీపంలో న్యగ్రోధవనం (మర్రితోపు)లో అన్ని ఏర్పాట్లూ చేశాడు.

బుద్ధుణ్ని ఆరాధించడానికి తండోపతండాలుగా ప్రజలు ఆ న్యాగ్రోధవనానికి వచ్చారు. శాక్య సామంతులు మొదట మేము రామన్నారు. సన్న్యాసి అయి. దేశాటనము చేస్తూ బుద్ధుడు తన జాతికే అప్రతిష్ట తెచ్చాడన్నారు. కానీ. ఒకసారి ఆయనను చూసి. ఆయన మాటలు విన్న తరువాత వారి మనస్సులు మారాయి. అంతా పరివ్రాజకులై. బుద్ధుని అనుయాయులయారు.

మర్నాడు ఉదయం పరివ్రాజకుల ఆచారం ప్రకారం బుద్ధుడు చేతిలో భిక్ష పాత్రతో భిక్షాటనానికి బయలుదేరాడు. ఆ మాట శుద్ధోదనుని చెవిని పడింది. "ఆహా! కపిలవస్తుపుర వీధులలో నా బిడ్డ భిక్షమెత్తుకోడమా!" అని ఆయన దుఃఖపడ్డాడు.

వెంటనే కుమారుని వద్దకు వెళ్ళి. "నన్నిలా ఎందుకు అవమానిస్తావు తండ్రీ! నీకూ, నీ పరివారానికీ సరిపడినంత ఆహారం నేను పంపుతాను-భిక్షాటనం మానెయ్యి" అన్నాడు.

"ఇది పరివ్రాజకుల ధర్మం!" అని బదులు చెప్పాడు బుద్ధుడు.

"ఇది ఏమి ధర్మం నాయనా! రారాజుల వంశంలో పుట్టావు నువ్వు!" అన్నాడు శుద్ధోదనుడు.

"కాదు. నేను పరివ్రాజకుణ్ని! పరివ్రాజకులకు ప్రపంచంలో ఒక వంశం అంటూ ఉండదు." అన్నాడు బుదుడు.

రాజు మారుమాట్లాడలేదు. బుద్ధుణ్ని. ఆయన శిష్యులనూ రాజ ప్రాసాదానికి తీసుకువెళ్ళాడు. రాజకుటుంబంలో వారంతా బయటికి వచ్చి స్వాగతం చెప్పారు. పిన తల్లి ప్రజాపతి- ఇతర అంతఃపుర స్త్రీలూ అంతా వచ్చారు. యశోధర మాత్రం రాలేదు." ఏమైనా అర్హత నాలో మిగిలి ఉంటే ఆయనే నన్ను చూడడానికి వస్తారు" అంటూ బయటికి రావడానికి ఆమె నిరాకరించింది.

శుద్ధోదనుడు బుద్ధునితో ఇలా అన్నాడు.'' నువు లేని ఈ ఏడేళ్ళూ యశోధర భిక్కునిగా జీవించింది. జుట్టు తీసివేసి కాషాయాంబరాలు ధరించింది. అచ్చమైన సన్న్యాసినిగా జీవితం గడుపుతూంది.''

బుద్ధుడు యశోధర గదిలోకి వెళ్ళాడు. అతని పాదాల మీదపడి ఆమె విలపించింది. ఆమె భక్తికి మెచ్చుకుని బుద్ధుడు ఆమెను ఆశీర్వదించాడు.

బుద్ధుని కుమారుడు రాహులుడు అప్పుడు ఏడేళ్ళ వాడు. ఆ కుర్రవాడు తండ్రి నెరుగడు. తనకు తండ్రి లేడనే, శుద్ధోదనుడే తనకు సర్వమూ అని అనుకుంటున్నాడు. కపిల వస్తు పురానికి బుద్ధుడు వచ్చిన ఏడవ రోజున యశోధర రాహులుణ్ణి రాజకుమారునిగా అలంకరించి తనకు వారసత్వం అనుగ్రహించమని కోరడానికి తండ్రి దగ్గిరికి పంపించింది. కుర్రవాడు వచ్చి బుద్ధుణ్ణి ఆ విధంగా అడిగాడు. ప్రియశిష్యుడు సారిపుత్రుణ్ణి పిలిచి, ''వీణ్ణి సంఘంలో చేర్చుకోండి!'' అని చెప్పాడు బుద్ధుడు.

# జగత్ ప్రవక్త

తాను కనిపెట్టిన నూతన మతాన్ని ప్రబోధించడం కోసం కపిల వస్తు పురం నుంచి బుద్ధుడు మళ్ళీ బయలు దేరాడు. ఎక్కడకు వెళ్ళినా తండోప తండాలుగా వచ్చి జనం ఆయన ప్రబోధాలు వింటున్నారు.

పెద్దకులాల వారికీ, తక్కువ కులాలవారికీ కూడా సమానంగా బుద్ధుడు ఆశ్రయం అయాడు.

బలవంతుడైన కోసల దేశపు రాజు ప్రసేనజిత్ కథ ఒకటి చెబుతూ ఉంటారు. ఒకప్పుడు ప్రసేనజిత్ జంతు బలితో కూడిన ఒక మహా యాగం చెయ్యడానికి సన్నాహాలు చేస్తున్నాడు. అంతలో బుద్ధుడు ఆ యాగ శాలకు వెళ్లాడు. జీవహింస అనుచితం అని ఆ రాజుతో వాదించాడు. ప్రసేనజిత్ ఆయన వాదనలు విని ఆయన బోధించే అహింసా మార్గాన్ని స్వీకరించాడు.

ఆ విధంగా బౌద్ధమతంలో చేరిన మరొక సుప్రసిద్ధ వ్యక్తి అంగుళిమాలుడు. తాను చంపిన వ్యక్తులందరి వ్రేళ్ళు కోసి మాలగా గుచ్చి మెడలో ధరిస్తూ ఉండే సంఘ బహిష్కృతుడు అంగుళిమాలుడు. దయామయుడైన బుద్ధుడు ఆయుధాలు గాని, పరివారం గాని లేకుండా ఒంటరిగా హింసాపరుడైన ఆ బందిపోటును సమీపించాడు. అహింసా ప్రవక్త చేసిన ఆ సాహసం బందిపోటులో పరివర్తన తెచ్చింది. వెంటనే అతను పరివ్రాజకుడై, అటు తరువాత బౌద్ధసంఘంలో ప్రముఖ సభ్యుడయాడు.

బౌద్ధ మతం పుచ్చుకున్న ఒక సుప్రసిద్ధ మహిళ విశాఖ. కోసలదేశం రాజధాని శ్రావస్తిలో ప్రముఖ వర్ధీ వ్యాపారస్థుడు ధనంజయుని కుమార్తె ఆమె. బాలికగా ఉండగానే తండ్రితోనూ, ఇతర కుటుంబ సభ్యులతోనూ సహా ఆమె బుద్ధుని అనుయాయిన అయింది. యుక్త వయస్సు వచ్చిన తరువాత విశాఖకు శ్రావస్తి నగరానికే చెందిన మరొక ప్రముఖ వర్ధీ వ్యాపారస్థుడు మిగరుని కుమారునితో వివాహం జరిగింది.

మిగరుడు బుద్ధుని అనుయాయి కాడు; జైన మతస్థుడు. బుద్ధుడన్నా, ఆయన బోధనలన్నా గౌరవం లేనివాడు. బుద్ధ భగవానుడు శ్రావస్తి నగరం సందర్శించి నప్పుడు విశాఖ ఆయనను తన ఇంటికి భిక్షకు పిలవాలనుకుంది. మిగరుడు అందుకు ఒప్పుకోలేదు. "ఎందరో యువకులు ఆయన వల్ల సంసారాలు వదలి సన్న్యాసులలో కలసి పోవడం నువ్వెరుగవా? ఎన్నో కుటుంబాలు ఆయన వల్ల విచ్ఛిన్నం అయాయి. అలాంటి వ్యక్తిని నువు మన ఇంటికి ఆహ్వానిస్తావా?" అన్నాడు.

''ఆయన విరోధులు వ్యాపింప జేసిన పుకార్లు అవి. ప్రతి ఇంటికీ ఆయన శాంతి సౌఖ్యాలనే సమకూరుస్తున్నారని నాకు తెలుసు.'' అని విశాఖ వాదించింది.

''ఆయన మనింటికి వస్తే వచ్చే నష్టం ఏముంది నాన్నా! ఒక మహా పురుషుని పట్ల చూపించ వలసిన సాధారణ గౌరవం చూపించినట్లవుతుంది'' అన్నాడు విశాఖ భర్త, భార్యను సమర్థిస్తూ.

చివరికి మిగరుడు ఒప్పుకోక తప్ప లేదు. విశాఖ బుద్ధుణ్ణి ఆహ్వానించింది. బుద్ధుని ప్రసంగం ఒకసారి వింటే మామగారు ఎలాగూ మనస్సు మార్చుకుంటారని ఆమెకు గట్టి నమ్మకం। అందుచేత — కుటుంబ సభ్యులలో బుద్ధుడు ప్రసంగించే టప్పుడు ఆ ప్రసంగం మిగరుని చెవులలో పడేట్టు ఆమె చూసింది.

అనుకున్నట్టె దయామయుడైన బుద్ధుని మాటలు మిగరుణ్ణి బాగా కదిలించాయి. ఆయన బౌద్ధ మతం స్వీకరించాడు.

శ్రావస్తిలో బుద్ధుడు చేసిన ప్రసంగాలు ఒకటి కూడా విడవకుండా విశాఖ వింది. ఒకసారి బుద్ధుని ప్రబోధం జరుగుతున్న గదిలో ప్రవేశించ గానే తలమీద వజ్రాభరణం తీసి పక్కన పెట్టింది. ప్రసంగం ముగిసిన తరువాత ఆభరణం మాట మరచిపోయి ఇంటికి వెళ్ళిపోయింది,

అందరూ హాలు వదలి వెళ్ళిన తరువాత బుద్ధుని శిష్యుడు ఆనందుడు ఆ ఆభరణం చూశాడు. అది విశాఖదై ఉంటుందని ఊహించి, ఒక పరిచారకుని కిచ్చి దానిని ఆమె ఇంటికి పంపాడు.

కాని విశాఖ దానిని తీసుకోలేదు. సంఘానికి దానిని తన కానుకగా అర్పించింది.

చాలా విలువైన ఆభరణం అది. దానిని కొనే స్తోమతు శ్రావస్తి లోని ధనికుల కెవ్వరికి లేదు. అందుచేత విశాఖ తనే తిరిగి దానిని కొంది. ఆ ధనంతో బుద్ధునికి, ఆయన శిష్యులకూ ఒక విహారం నిర్మించి, 'ప్రాచ్య వనం' అని దానికి పేరుపెట్టింది. బుద్ధుడు ఎప్పుడు శ్రావస్తి వచ్చినా అక్కడే దిగేవారు.

అనంత పిండకుడు శ్రావస్తిలో ఒక ధనిక వర్తకుడు. అతని అసలు పేరు సుదత్తుడు. అతడు చేసిన దాన ధర్మాలవల్ల 'అనంతపిండకు' డనే బిరుద నామం అతనికి ఏర్పడింది

ఒకసారి ఏదో వ్యాపారం పనిమీద రాజగృహం వెళ్ళినప్పుడు అతడు అక్కడ తన సోదరి ఇంట్లో బస చేశాడు. ఎవరి రాకకోసమో వారు బ్రహ్మాండమైన స్వాగతం ఏర్పాట్లు చేస్తున్నారు. బహుశాః మగధరాజు బింబిసారుని కోసం తన బావగారు ఆ ఏర్పాట్లు చేస్తున్నాడని ఆయన అనుకున్నాడు. కాని వాళ్ళ బావ ఇలా చెప్పాడు. "శిష్యులతో సహా బుద్ధభగవానుడు మన ఇంటికి వస్తున్నారు!"

"ఇప్పుడు ఆయన ఎక్కడ ఉన్నారు?" కుతూహలంగా అడిగాడు అనంత పిండకుడు.

"సీతావనం దాకా వచ్చి ఉంటారు" అన్నాడు బావగారు. ఆవనం నగరానికి ఎంతో దూరం లేదు.

అనంతపిండకుడు వెంటనేవెళ్ళి బుద్ధుణ్ణి సందర్శించాలనుకున్నాడు. కాని, ఆయన అపుచేశాడు_ "ఇప్పుడు చాలా ప్రొద్దుపోయింది. తెల్లవారు జామునే లేచి వెళుదువుగానిలే!" అంటూ.

అనంత పిండకునికి ఆ రాత్రి సరిగా. నిద్రపట్టలేదు. తెల్లవారి పోయిందనే భ్రాంతితో మూడుసార్లు లేచి చూశాడు. వేకువ జామునే లేచి బయలుదేరాడు. బుద్ధుడింకా నిద్రలేవకముందే సీతావనం చేరుకున్నాడు.

బుద్ధుడు ప్రేమగా అతెణ్ణి సంభావించి, దర్మపథం అవలంబించమని హితబోధ చేశాడు. అనంతపిండకునకు ఆ బోధలు బాగా నచ్చాయి. సంసార బాధ్యతలన్నీ వదలి సన్న్యాసం స్వీకరించడానికి ఆయన సిద్ధపడ్డాడు. "భోగభాగ్యాలన్నీ వదలి పరివ్రాజకుడనై నేను మీ సంఘంలో చేరుతాను ప్రభూ!" అన్నాడు.

"ధనవంతుడై ఉండడంలో తప్పేమీ లేదు" అన్నాడు బుద్ధుడు. "ఆ డబ్బు

మీద ఎక్కువ మమకారం పెంచుకోడం మాత్రమే తప్పు. ధనికులు. తమ డబ్బును
ఎప్పుడూ నలుగురి సుఖంకోసం ఖర్చుపెట్టడానికి సంసిద్ధంగా ఉండాలి!''

''జీవనోపాధికోసం ఎందరో నా మీద ఆధారపడి ఉన్నారు'' అన్నాడు అనంత
పిండకుడు.

''అయితే నువు సన్న్యసించి వారిని పస్తులు పెట్టడం ఏం ధర్మం?'' అని
అడిగాడు బుద్ధుడు. ''ధర్మపథం అనుసరించాలంటే సంసారాన్ని వదలనక్కరలేదు.
నువు ఇప్పుడు గడుపుతున్న జీవితం సక్రమమైందే. దానిని ఎందుకు వదులుకోడం?''

ఆ ముని మాటలు అనంత పిండకునికి ఆనందం కలిగించాయి. ''అయితే బౌద్ధ
భిక్షువులు వర్షాకాలంలో చాతుర్మాస్య వ్రతం గడపడానికి శ్రావస్తిలో ఒక మఠం
కట్టించి ఇస్తాను'' అన్నాడు. బుద్ధుడు అంగీకరించాడు.

బుద్ధుని ప్రధాన శిష్యులలో ఒకడైన సారిపుత్రుణ్ణి వెంటపెట్టుకొని అనంత
పిండకుడు మఠ నిర్మాణానికి తగిన స్థలం కోసం వెతకసాగాడు. ధ్యానానికీ, ప్రార్థన
లకూ తగిన ప్రశాంతమైన స్థలం ఒకటి నగరానికి సమీపంలోనే వారికి కనిపించింది.
అయితే ఒక చిక్కు వచ్చింది. ఆ స్థలం జేతరాకుమానిది అతడు దానిని అమ్మడానికి
ఒప్పుకోలేదు.

అనంతపిండకుడు మొండిపట్టుపడుతూ ఉండడం చూసి, అతనిని ఎలాగైనా
వదల్చుకోవాలని ఆ రాకుమారుడు ఇలా అన్నాడు.'' 'ఆ స్థలాన్ని నువు బంగారంతో
కప్పగలిగితే తప్ప దానిని నువు కొనలేవు''

వెంటనే అనంతపిండకుడు బళ్ళ కొద్దీ బంగారు నాణేలు తెప్పించి ఆ స్థలం
మీద పరవడం మొదలుపెట్టాడు.

అలా జరుగుతుందని జేత రాకుమారుడు అనుకోలేదు. ''నేను నవ్వులాటకు
అలా అన్నాను గాని ఆ స్థలం నేను నీకు అమ్మను!'' అన్నాడు.

ఇద్దరి మధ్య తగవు తెగక న్యాయస్థానికి వెళ్ళారు. ''నువు నవ్వులాటకే అలా

ఆస ఉండవచ్చు. కాని, నువ్వడిగిన మొత్తం ఇవ్వడానికి అతడు అంగీకరించాడు గనుక ఈ క్రయం జరిగిపోయినట్టే!'' అని తీర్పు చెప్పాడు న్యాయాధిపతి.

ఆ విధంగా తన కిష్టం లేకపోయినా జేత రాకుమారుడు ఆ స్థలాన్ని అమ్మక తప్పలేదు. అయితే-అక్కడ ఒక బౌద్ధ విహారం నిర్మించబోతున్నట్టు విని ఎంతో సంతోషించాడు. ఆ బంగారంలో సగం మాత్రమే తను తీసుకుని తక్కిన సగం విహారానికి విరాళంగా ఇచ్చాడు. ''ఈ నేల నీది. దీనిలోని చెట్లు నావి. నా వాటా నేను బుద్ధ భగవానునికి కానుకగా అర్పించుకుంటున్నాను.'' అన్నాడు.

అలా అక్కడ నిర్మించబడిన విహారాలలో అది ఒకటి. ఎన్నో ప్రబోధ ప్రసంగాలు బుద్ధుడు అక్కడ చేశారు. మంది మార్బలంతో ప్రసేనజిత్ మహారాజు ఎన్నో సార్లు అక్కడికి వచ్చారు. అనేక విషయాలను గురించి బుద్ధుడు ఆయనకు బోధించారు. రాజ ధర్మాలను వివరిస్తూ బుద్ధుడు ఇలా అన్నారు.' ఒక్కగానొక్క కొడుకును చూసుకునేటంత ప్రేమగా రాజు తన ప్రజలను చూసుకోవాలి. వారినే విధంగానూ పీడించరాదు. వారు ధర్మపథం అనుసరించేందుకు తోడ్పడాలి. పేదవారినీ, కష్టాలలో ఉన్నవారినీ ఆదుకోవాలి, ఆదరించాలి!''

ఒకప్పుడు తన ప్రియశిష్యుడు ఆనందునితో సహా బుద్ధుడు అక్కడ విడిది చేశారు. అలవాటు ప్రకారం పెందరాడే నిద్రలేచి, చేతిలో భిక్షా పాత్రతో ఆనందుడు నగరంలో భిక్షాటనకు బయలుదేరాడు. విహారానికి తిరిగి వస్తూ ఉండగా అతనికి దాహమైంది. ప్రక్కకు ఉన్న బావి వద్దకు వెళ్ళాడు. అక్కడ ఒక చండాల బాలిక నీళ్ళు తోడుకుంటూంది.

''దాహం అవుతూంది. కొంచెం నీళ్ళు పోస్తావా చెల్లీ!'' అని అడిగాడు ఆనందుడు.

''నేను అంటరాన్ని దాన్ని-మీకు తెలియదా?'' అంది ఆశ్చర్యపోతూ ఆమె.

''నేను నీ కుల గోత్రాలు అడగడం లేదు తల్లీ! కావిని నీళ్ళుంటే పోసి నా దప్పిక తీర్చమంటున్నాను-అంతే!'' అన్నాడు ఆనందుడు.

సంఘంలో వర్ణభేదాలను బుద్ధుడు గుర్తించలేదు. అస్పృశ్యత అనే దురాచారం మానవత్వానికే తీరని కళంకం అని ఆయన ఉద్దేశం. అందుకే ఆయన ప్రియశిష్యుడు ఆనందుడు నిస్సంకోచంగా అంటరాని బాలిక చేతినీళ్ళు తాగాడు.



# పిట్ట కథల ద్వారా హితబోధ

బుద్ధుణ్ణి గురించి ఎన్నో కథలు ప్రచారం ఆయాయి. శాంతిదూతగా ఆయన పాత్రను వివరించే కథ ఒకటి ఉంది. తన బంధుకోటికి చెందిన శాక్యులూ, కోలియాలూ రోహిణీ నదీజలాల కోసం ఒకప్పుడు పరస్పరం యుద్ధానికి తలపడ్డారు. యుద్ధ రంగంలో రెండు సైన్యాలూ ఎదురు బదురుగా నిలుచున్నాయి. అంతలో కాషాయ వస్త్రాలతో కరుణార్ద్ర హృదయుడైన బుద్ధుడు అక్కడకు వచ్చాడు.

''నదీ జలాలకు స్వతస్సిద్ధంగానే విలువ ఉందా? లేక వాటివల్ల ప్రజలకు కలిగే మేలు మూలన వాటికి విలువ ఏర్పడుతుందా?'' అని శాంతంగా బుద్ధుడు వారిని ప్రశ్నించాడు.

ప్రజలకు వాటి వల్ల కలిగే మేలు వల్లనే వాటికి విలువ ఏర్పడుతుందని రెండు పక్షాల వారూ జవాబు చెప్పారు.

''మరి మీరు యుద్ధానికి దిగితే ఇరుపక్షాలలోనూ ఎందరో ప్రజలు ప్రాణాలు కోల్పోతారు. అందుచేత మీకు నదీ జలాలు ఎక్కువ విలువైనవో, ప్రజల ప్రాణాలు ఎక్కువ విలువైనవో ముందుగా మీరు తేల్చుకోవాలి!'' అన్నాడు బుద్ధుడు. వెంటనే ఆ రాజులిద్దరూ రాజీపడి యుద్ధం విరమించారు.

ఒకసారి బుద్ధుడు రోజూలాగే భిక్షాటన చేసే సమయంలో మూర్ఖ యువకుడు ఒకడు అకారణంగా ఆయనను దూషించాడు. బుద్ధుడు ప్రశాంతంగా అతనితో ఇలా అన్నారు. ''నాయనా! ఎవరైనా కానుక ఇవ్వబోతే, దానిని అవతలి వ్యక్తి నిరాకరిస్తే అది ఎవరికి చెందుతుంది?''

''కానుకగా ఇవ్వబోయిన వానికే చెందుతుంది'' అన్నాడు యువకుడు.

''నువు ఇప్పుడు నాకు దూషణలు ఇచ్చావు. వాటిని నేను స్వీకరించడం లేదు. ప్రతిధ్వని ధ్వనినీ, నీడ వస్తువునీ అనుక్రమించినట్టు 'చెడు' చెడ్డపని చేసేవానినే ఆవరిస్తుంది'' అన్నాడు బుద్ధుడు.

ఒక్కొక్కప్పుడు తాను చెప్పదలచుకున్న విషయం విశదం చెయ్యడం కోసం ఆయన పిట్ట కథలు చెప్పేవారు. కాశీరాజు కథ అలా చెప్పిందే!

కాశీరాజు చాలా బలవంతుడు. ఒకప్పుడు పొరుగున ఉన్న కోసలరాజు బలహీనుడుగా ఉండడం చూసి ఆ రాజ్యం మీద దాడి చేశాడు. కోసలదేశపు రాజూ, రాణీ పారిపోయి కాశీలో ఒక కుమ్మరివాని ఇంట్లో తల దాచుకున్నారు. అక్కడ దీర్ఘాయువు అనే కొడుకు వారికి కలిగాడు.

దీర్ఘాయువు ఇంకా బాలుడుగా ఉండగానే అతని తల్లిదండ్రుల ఆచోకీ కాశీరాజుకి తెలిసింది. వాళ్ళను బంధించి, ఉరిశిక్ష విధించాడు. దీర్ఘాయువు తప్పించుకుని రహస్యంగా తల్లిదండ్రులను ఉరి తీసే చోటికి వెళ్ళాడు. అతని తండ్రి అతని నుద్దేశించి చెప్పిన చివరి మాటలు "ద్వేషంతో ద్వేషం నశించదు. ద్వేషించకుండా ఉండడం వల్లనే ద్వేషాన్ని నశింప చేయవచ్చును."

దీర్ఘాయువు పెరిగి పెద్దవాడై అనేకవిద్యలలో ఆరితేరాడు. రాజుగారికోటలో అతనికి ఉద్యోగం వచ్చింది. అతి వేగంగా పైకివచ్చి రాజుగారికి విశ్వాస పాత్రుడైన అంగ రక్షకు డయాడు. ఒక రోజున వేటలో రాజుగారు తన సైన్యానికి దూరం అయారు. దీర్ఘాయువూ తనూ మాత్రమే మిగిలారు. బాగా అలసిపోయి ఉన్న రాజు దీర్ఘాయువు ఒళ్ళో తల పెట్టుకుని నిద్ర పోయాడు.

సరిగ్గా అలాంటి అవకాశం కోసమే దీర్ఘాయువు ఎదురు చూస్తున్నాడు. ఒరలో నుంచి కత్తి బయటికి లాగి ఇలా అన్నాడు. "మా తల్లిదండ్రులను నువు వధించావు ఇప్పుడు నీ వంతు వచ్చింది."

అంతలో హఠాత్తుగా అతనికి తన తండ్రి అన్న చివరి మాటలు గుర్తువచ్చాయి. వెంటనే దీర్ఘాయువు కత్తిని మళ్ళీ ఒరలో పెట్టి, భయంతో వణికిపోతున్న రాజును భద్రంగా కోటకు చేర్చాడు. క్షమాగుణంతో కూడిన అతని నడవడి కాశీరాజును కదలించి వేసింది. పశ్చాత్తాపంతో అతడు దీర్ఘాయువు తండ్రి దగ్గిరనుంచి తాను హరించిన ఆస్తి అంతా అతనికి తిరిగి ఇచ్చి వేయడమే కాక, తన కూతురును కూడా ఇచ్చి అతనికి పెళ్ళి చేశాడు.

దీర్ఘాయువు లాంటి క్షమాగుణం ప్రజలందరూ అలవరచుకోవాలి_అని బుద్ధుడు ప్రజలకు బోధించేవాడు.

తన మాధ్యమిక వాదాన్ని శ్రుతి చేసిన వీణతో బుద్ధుడు సరిపోల్చేవాడు. వీణ తీగెలు బాగా బిగుతుగా ఉన్నా, బాగా వదులుగా ఉన్నా దానిమీద స్వరాలు సరిగా

పలుకవు. వీణ చక్కగా పలకాలంటే తగినంతగా మాత్రమే తీగెలను బిగించాలి. అలాగే-కర్మలో గాని, 'అకర్మలో గాని మాధ్యమిక మార్గాన్ని మనిషి అనుసరించాలి।

మరో సందర్భంలో నిర్వాణాన్ని గురించి తనను ప్రశ్నించిన ఒక శిష్యునితో బుద్ధుడు ఇలా అన్నాడు: 'బాలబాలికలు ఇసుకలో కట్టిన పిచ్చిక గూళ్ళతో ఎలా ఆడుకుంటారో చూడు। ఆటమీద ఆసక్తి ఉన్నంతవరకూ ఆ గూళ్ళు వారికి ఎంతో విలువైనవి. అవునా?''

''ఔను ప్రభూ।'' అన్నాడు శిష్యుడు.

''కాని, ఆట పూర్తికాగానే వాటిని పడగొట్టి వేస్తారు-అవునా?''

''ఔను-ప్రభూ।''

''అదే విధంగా జీవితం మీద మమకారం ఉన్నంత వరకూ ప్రజలు ఈ దేహ యాత్రకు ఎంతో విలువ ఇస్తారు. దానిమీద మక్కువ తొలగగానే శరీరపు మనుగడ అంతరించి పోతుంది. అప్పుడు ఆత్మ నిర్వాణం పొందుతుంది.''

ఒకసారి బుద్ధుడు శ్రావస్తి వెళుతూ ఉండగా దారిలో కీసగౌతమి' అనే ఆమె ఒక శిశువు శవంతో బుద్ధుని దగ్గిరకు వచ్చింది. పాపం ఎవరో ఆమెకు-అలౌకిక శక్తులతో బుద్ధుడు ఆ బిడ్డను బ్రతికించగలడని చెప్పారు.

శ్రావస్తిలోని ఒక ధనిక వర్తకుణ్ణి వివాహమాడిన పేదింటి పిల్ల కీసగౌతమి. ఆమెకు ఒక్కగా నొక్క బిడ్డ. వాడంటే ఆమెకు పంచప్రణాలూ। ఒక రోజున వాడు తోటలో ఆడుకుంటూ ఉండగా ఒక విష సర్పం వాణ్ణి కరిచింది. వాడు చచిపోయాడు. గౌతమి దుఃఖానికి అంతు లేదు. చలువలు కమ్మిన ఆ బిడ్డ శవాన్ని ఆమె బుజాన వేసుకుని కనిపించిన ప్రతి వారినీ వాడు బ్రతికే మందు చెప్పమని అడుగుతూంది.

''పాపం! పిచ్చి గౌతమి! ఈమెకు మతి చలించింది।'' అనుకున్నారు ప్రజలు.

అందరూ ఆమె మీద జాలి పడుతున్నా ఎవరూ ఆమెకు సహాయం చేయలేక పోతున్నారు. చివరికి ఒక వృద్ధుడు ఇలా అన్నాడు: ''నువు బుద్ధ భగవానుని సహాయం కోరుతల్లీ! లోకంలో అందరి దుఃఖాన్ని బాధలనూ ఆయన తొలగిస్తున్నారని చెబుతున్నారు.''

కొడుకు శవాన్ని గుండెలకు హత్తుకుని గౌతమి బుద్ధుని వద్దకు పరుగెత్తింది. ఆయన పాదాల మీద పడి వేడుకుంది. ''ప్రభూ! నన్ను కరుణించు! ఏదైనా మందిచ్చి నా బిడ్డను బ్రతికించు!''

ఆమె దురవస్థను అర్థం చేసుకున్న బుద్ధుడు శాంతంగా ఇలా అన్నారు: ''ఒక గుప్పెడు ఆవాలు తీసుకురా తల్లీ!''

''క్షణంలో తీసుకు వస్తాను ప్రభూ!'' అంటూ ఆమె బయలుదేరబోతూ ఉండగా ఆమెను పిలిచి బుద్ధుడు-''అయితే ఒక్క మాట గుర్తుంచుకో! ఎవరూ ఎప్పుడూ చనిపోయి ఉండని ఇంట్లో నుంచి నువు ఆ ఆవాలు తేవాలి!''

ఆవాల కోసం గౌతమి ఇల్లిల్లూ తిరిగింది. ముందుగా వారిని ఇలా ప్రశ్నించేది: ''కొడుకో, కూతురో, తల్లో, తండ్రో, మిత్రుడో, బంధువో ఎవరైనా ఈ ఇంట్లో చనిపోయారా?'' ప్రతిచోటా ఆమెకు ఒకే రకం జవాబు వచ్చేది: ''బ్రతికి ఉన్న వారు తక్కువా చచ్చిపోయిన వారే ఎక్కువమ్మా! కావలసిన వాళ్ళెందరో మమ్మల్ని వదలి వెళ్ళి పోయారు!''

నగరంలో ప్రతి ఇంటికీ గౌతమి వెళ్ళింది. కాని మరణం సంభవించని ఇల్లు ఒక్కటి కూడా ఆమెకు కనిపించలేదు. చివరికి-బుద్ధుడు బోధించదలుచుకున్న సత్యం ఆమెకు అర్థం అయింది. ''చావు సర్వ జంతు సాధారణం!'' అని ఆమెకు బోధ పడింది.

కొడుకును ఖననం చేసి, మళ్ళీ దయామయుడైన బుద్ధుని దర్శనానికి వెళ్ళింది. ఆయన ఇలా ఉపదేశించారు: ''ఇంకెన్నడూ దుఃఖపడకు! ఏదీ కలకాలం నిలిచి ఉండదు.''

# ఈర్ష్యాపరుడైన దేవదత్తుడు

బుద్ధుని దాయాది అయిన దేవదత్తుడు సన్న్యసించే పర్యంతం బుద్ధునితో నిరంతరం కలసి తిరిగిన బాల్య మిత్రుడు. బాల్యంనుంచీ సిద్ధార్థుడంటే అతనికి అసూయ। ఏదో విధంగా అతణ్ణి నొప్పించాలని చూసేవాడు. అతనిమీద కక్షతో ఒకసారి సిద్ధార్థునికి మిక్కిలి ఇష్టమైన ఒక తెల్ల ఏనుగును చంపివేశాడు.

జ్ఞానోదయం అయిన తరువాత మొదటిసారి బుద్ధుడు కపిలవస్తు పురం వచ్చి నప్పుడు ఇతర శాక్య సామంతులతో పాటు దేవదత్తుడు కూడా బౌద్ధ సంఘంలో చేరాడు. చిన్ననాటి స్నేహితుడు గదా అని బుద్ధుడు అతనిపట్ల ప్రత్యేకమైన ఆదరం చూపించాడు. త్వరలోనే అతడు సంఘంలో ప్రముఖ స్థానం ఆక్రమించాడు.

బౌద్ధ సంఘానికి ఎదురులేని నాయకుడు బుద్ధుడు. అది చూసి దేవదత్తునిలో ఈర్ష్య పొడచూపింది. తనే ఆ సంఘానికి నాయకుడు కావాలని అతని ఆకాంక్ష! మెల్లగా బుద్ధుని వద్దకు వెళ్ళి ఇలా అన్నాడు: "భగవాన్! మీకు వృద్ధాప్యం వస్తూంది. విశ్రాంతి అవసరం అందుచేత తాము నాయకత్వ బాధ్యతనుంచి వైదొలగి ఆ బాధ్యతను నాకు వప్పగించడం మంచిది."

"నేను జీవించి ఉన్నంతకాలం ఈ సంఘాన్ని నేనే నడిపిస్తాను."' అన్నాడు బుద్ధుడు. దేవదత్తుని సలహాలో అంతరార్థం ఆయనకు బోధపడింది.

ఆ విధంగా సంఘ నాయకత్వం చేజిక్కించుకునే ప్రయత్నం విఫలమైన తరువాత దేవదత్తుడు సంఘాన్ని రెండుగా చీల్చడానికి పూనుకున్నాడు. బుద్ధుడు ఇక 8 ఏళ్ళకు సిద్ధి పొందుతారనగా దేవదత్తుడు దగ్గిర మిత్రులతోనూ, అనుచరులతోనూ ఒక పోటీ 'సంఘం' నెలకొల్పాడు. రాజగృహం సంఘారామంలోని 500 మంది భిక్కుల్ని తన క్రొత్త సంఘంలో చేరేట్టు ప్రోత్సహించాడు.

బౌద్ధ సంఘాన్ని వదలిపెట్టడానికి సిద్ధపడ్డ 500 మంది భిక్కులకూ నచ్చచెప్పడం కోసం సారిపుత్రుణ్ణీ, మొగ్గలాయనుణ్ణి బుద్ధుడు రాజగృహం పంపించాడు. బుద్ధుని అగ్ర శిష్యులైన ఆ ఇరువురూ కూడా ఆయనను వదలి తన సంఘంలో చేరడానికి వచ్చారని దేవదత్తుడు భ్రమపడ్డాడు. ఆ 500 మంది భిక్కులకూ ఉపన్యసించమని వారిని ఆహ్వానించాడు.

సారిపుత్రుడూ, మొగ్గలాయనుడూ వారితో వాదించి, వారు తీసుకో బోతున్న చర్యలోని అవివేకాన్ని వారికి తెలియ జెప్పారు. దేవదత్తుడు చూపిస్తున్న అప మార్గాన్ని వదలి తిరిగి బుద్ధుని ధర్మ పథాన్నే అనుసరించేట్టు వారికి నచ్చచెప్పారు.

దేవదత్తునికి చాలా కోపం వచ్చింది. బుద్ధుని మీద ద్వేషం మరింత తీవ్రమై ఆయనను హత్య చేయాలని తీర్మానించుకున్నాడు. అందుకు మగధరాజు కుమారుడు అజాత శత్రువును ఆసరా చేసుకున్నాడు.

బింబిసారుడు బుద్ధ భగవానునికి నమ్మిన బంటు. ఆయన జీవించి ఉన్నంత కాలం మగధ రాజ్యంలో తన ఆటలు సాగవని దేవదత్తునికి తెలుసు. అందుచేత అజాత శత్రువుకి ఇలా దుర్బోధ చేశాడు. "మీ తండ్రి ఏమంత ముసలివాడు కాదు. నువ్వు ఎప్పటికైనా రాజువి కాగలవనే ఆశ నీకు ఉందా?"

అజాత శత్రువులో ఆందోళన చెలరేగింది.

"నీ తండ్రిని వధించి నువ్వు ఎందుకు రాజువి కాకూడదు?" అని సలహా చెప్పాడు దేవదత్తుడు.

అజాత శత్రువు తేలికగా అతడు పన్నిన వలలో పడ్డాడు. తండ్రిని చంపడానికి కుట్రలు పన్న సాగాడు. ఒక రోజున చేతిలో బాకుతో తండ్రి పడక గది దగ్గిర తారట్లాడుతూ పట్టుపడ్డాడు. అతణ్ణి రాజుగారి సమక్షంలో తెచ్చి నుంచోపెట్టారు. బింబిసారునకు కొడుకును శిక్షించాలని అనిపించలేదు. సర్వాత్మనా ఆయన బుద్ధునికి అనుయాయి. హింస అంటే ఇష్టపడనివాడు ఆ ప్రవక్త బోధలకు అనుగుణంగా-కావాలని పదవీ త్యాగంచేసి అజాత శత్రువుకి రాజ్యాన్ని వప్పగించాడు. బింబిసారుడు సన్న్యసించి పరివ్రాజకు డయాడు. కాని, మళ్ళీ ఎప్పటికైనా బింబిసారుడు తననుంచి రాజ్యాన్ని తిరిగి స్వాధీనం చేసుకుంటాడని దేవదత్తుడు చేసిన దుర్బోధల వల్ల అజాత శత్రువు తండ్రిని హత్యచేశాడు.

అజాతశత్రువు రాజయిన తరువాత రాజగృహంలో దేవదత్తుని పలుకుబడి హెచ్చింది. బుద్ధుడు ఆ వర్షాకాలం అక్కడ గడపడానికి సపరివారంగా వస్తున్నారని తెలిసి దేవదత్తుడు ఆయనను చంపడానికి కుట్రలు పన్నాడు.

అజాతశత్రువు సైన్యంలో విలువిద్యలో ఆరితేరిన కొందరిని ఎంచి, బుద్ధ భగవానుడు వచ్చే దారిలో వేరువేరు చోట్ల వారిని నిలబెట్టాడు. కాని బుద్ధుడు కంట

పడగానే ఆయన దివ్య తేజస్సు చూసి ఆ విలుకాండ్రు ఆయన పాదాలమీద వాలి, తాము ఆయనను చంపడానికి వచ్చినట్టు చెప్పారు. దయాహృదయుడైన బుద్ధుడు వారిని క్షమించి దేవదత్తుని వద్దకు వారిని తిరిగి పంపాడు.

ఆ విధంగా విలుకాండ్రు విఫలులు కావడంతో దేవదత్తుని కోపం మరీ ఎక్కువైంది. తన పన్నాగం అమలు జరపడానికి మరొక అవకాశంకోసం చూస్తూ ఆ ప్రవక్త కదలికలను జాగ్రత్తగా గమనిస్తున్నాడు. ఒక రోజున 'రాబందు శిఖరం' అనే ఒక కొండ దిగువ భాగాన బుద్ధుడు ధ్యానంలో నిమగ్నుడై ఉండగా దేవదత్తుడు కొండ శిఖరం మీదికి ఎక్కి ఒక పెద్ద బండను క్రిందికి దొర్లించాడు. అతి వేగంగా దొర్లివస్తూ ఆ బండ మధ్యదారిలో మరొక పెద్ద బండకు తగిలి ముక్కలు ముక్కలై చెదిరిపోయింది.

వెనుకటి కంటె కూడా తీవ్రంగా దేవదత్తుడు ఎలాగైనా బుద్ధుణ్ణి మట్టు పెట్టాలని చూస్తున్నాడు. రాజగృహంలో మిక్కిలి భయంకరమైన 'నలగిరి' అనే ఏనుగు తాలూకు మావటివాళ్ళకు బోలెడు బంగారం లంచంపెట్టి, "బుద్ధుడు రేపు ఈ దారిని వస్తూ ఉండగా మీరు 'నలగిరి'ని అతని మీదికి వదలండి!" అని చెప్పాడు. మర్నాడు రోజులాగే భిక్షకోసం బుద్ధుడు నగరంలోకి బయలుదేరాడు. ఆయనను చూడగానే మావటి వాళ్ళు 'నలగిరి'ని వదలి పెట్టారు. పెద్దపెట్టున ఘీంకరిస్తూ తొండం పైకెత్తుకుని కోపంగా ఆ ఏనుగు బుద్ధుని వైపువచ్చింది.

బుద్ధ భగవానునికి అంతరంగిక శిష్యుడైన ఆనందుడు ఏనుగు అలా వస్తూ ఉండడం చూసి బుద్ధునికి ముందు నిలబడి_"నేనే ఈ ఏనుగుకి ముందుగా బలి అవుతాను" అన్నాడు.

కాని, అప్పటికే ఏనుగు తీవ్రత తగ్గి శాంతపడింది. ప్రేమ, కరుణ నిండిన బుద్ధ భగవానుని ఒక్క చల్లని చూపు సోకేసరికి భయంకరమైన 'నీలగిరి' శాంతించింది. బుద్ధిమంతుడైన విద్యార్థిలాగ తొండం క్రిందికి దించి ఆయనకు

ఎదురుగా వచ్చి నుంచుంది. ప్రేమగా దానిని పలుకరించి బుద్ధ భగవానుడు దీవించాడు.

బుద్ధుని పాదాలవద్ద ఏనుగు మోకరిల్లింది. తొండంతో భగవానుని పాదధూళి తీసుకుని తలమీద చల్లుకుంది. అనంతరం శాంతంగా తన కాలకు తిరిగి వెళ్ళిపోయింది.

అటు తరువాత కొద్ది కాలానికే దేవదత్తుడు చిచ్చు పడ్డాడు. పశ్చాత్తాపం చెంది, బుద్ధ భగవానుణ్ణి క్షమాపణ వేడుకోవాలని తహతహలాడాడు. కొందరు భిక్కుల సాయంతో బుద్ధుని దర్శనానికి బయలుదేరాడు. అయితే_ఆయనను కలుసుకోకుండానే దారిలో నోరారా బుద్ధ సంకీర్తనం చేస్తూ ప్రాణాలు వదిలాడు.



# చివరి రోజులు

బుద్ధునికి వృద్ధాప్యం వస్తూంది. ఉపచారాలు చేసేందుకు ఎవరైనా అవసరం అయారు. అందుకు ప్రముఖ శిష్యులందరూ నేనంటే నేనని పోటీ పడ్డారు. "నేనే మీ సేవ చేసుకుంటాను ప్రభూ!" అని వేడుకున్నాడు సారిపుత్రుడు.

"కాదు_నాకే ఆ అవకాశం ఇవ్వండి!" అని ముందుకు వచ్చారు మొగ్గలాయనుడు.

బుద్ధుడు ఆలోచించాడు. సారిపుత్రుడూ, మొగ్గలాయనుడు సంఘంలో చాలా ముఖ్యమైన వ్యక్తులు. సంఘ నిర్వహణ బాధ్యత లెన్నో వారు వహిస్తున్నారు. వారిలో ఒకరిని తన ఉపచారాలకోసం తీసుకుంటే సంఘం పనులు దెబ్బతినవచ్చు. అదీకాక వారికీ వృద్ధాప్యం వస్తూంది. అందుచేత బుద్ధుని దాయాదీ, యువకుడూ అయిన ఆనందుడు అందుకు తగినవాడు అని అతణ్ని తన వృద్ధాప్యంలో సహచరుడుగా బుద్ధుడు ఎంచుకున్నాడు.

ఆనందుడు బుద్ధుని ప్రియతమ శిష్యులలో ఒకడు అయాడు. ఇరవై ఏళ్ళ పైచిలుకు బుద్ధ భగవానుని పరిచర్యలు చేశాడు. ఎనభయవ పడిలో పడుతున్నా దయామయుడైన బుద్ధుడు తన మత ప్రచారంకోసం ఇంకా దేశ మంతటా విరివిగా పర్యటిస్తూనే ఉన్నాడు.

తన చివరి రోజులు బుద్ధుడు విచ్ఛవీ గణరాజ్యం రాజధాని వైశాలీ నగరంలో గడిపాడు. అక్కడ 'ఆమ్రపాలి' అనే వేశ్య తాలూకు మామిడి తోటలో ఆయన విడిది చేశారు. శాక్యముని తన తోటలో బస చేశారని తెలిసి ఆమ్రపాలి ఆయన దర్శనానికి వెళ్ళింది. ఆ మునినీ, ఆయన పరివారాన్ని తన ఇంట భిక్షకు ఆహ్వానించింది.

చిత్రంగా - అదే రోజున మిక్కిలి గర్విష్ఠులైన విచ్ఛవీ సామంతులూ, వైశాలి పాలకులూ కూడా బుద్ధ భగవానుణ్ణి దర్శించి, సపరివారంగా ఆయనను తమ ప్రాసాదానికి భిక్షకు ఆహ్వానించారు.

బుద్ధుడు వారి ఆహ్వానాన్ని నిరాకరించారు. "నేనింతకు ముందే ఆమ్రపాలి ఇంటికి వస్తానని మాట ఇచ్చాను" అన్నారు.

"కేవలం ఒక వేశ్య ఆహ్వానం కోసం మా ఆహ్వానాన్ని కాదనడం భావ్యమా?" అని వాదించారు సామంతులు.

కాని. బుద్ధుడు మెత్తబడ లేదు. పెద్దా, చిన్నా - అందరూ ఆయన దృష్టిలో సమానులే! పైగా - విచ్ఛవీ సామంతుల కంటె ఆ వేశ్యకే తన అవగాహన, కరుణ ఎక్కువ అవసరం అని ఆయన భావించారు.

భోజనాలు అయిన తరువాత బుద్ధుడు సమీపంలో ఉన్న ఒక ఊరు వెళ్లారు. అక్కడ ఆయనకు తీవ్రంగా జబ్బు చేసింది. అవసానకాలం చేరువ అయిందని ఆనందుడు భయపడ్డాడు. తనను అనాథగా చేసి వెళ్ళి పోవద్దని బుద్ధుణ్ణి బ్రతిమి లాడుతూ పసి పిల్ల వాడిలాగ ఏడ్చాడు. "మీరు శరీరం చాలిస్తే మాకిక దిక్కెవరు?" అన్నాడు.

"దుఃఖించకు ఆనందా! నా ఉపదేశాలూ, సంఘం మీకు మార్గ దర్శకాలు కాగలవు!" అంటూ బుద్ధభగవానుడు అతణ్ణి ఓదార్చారు.

ఆ జబ్బునుంచి ఆయన కోలుకున్నారు. ఆ తరువాత మరింత తీవ్రంగా మత ప్రచారం చేయసాగారు. తన అనంతరం తన అనుయాయులైన ఆ పరివ్రాజకుల పరిస్థితిని గురించి ఆలోచించారు. వైశాలి లోని పరివ్రాజకుల నందరినీ సమావేశ పరచి వారికి తుది సందేశం ఇచ్చారు :

"ఎవరికీ వారే ఆశ్రయం కావాలి. ప్రతి వారికీ ఆత్మ సంయమం అవసరం. ఆత్మ సంయమం ద్వారానే సత్యాన్ని తెలుసుకోడం, సక్రమంగా జీవించడం సాధ్య మవుతుంది!

వైశాలి నుంచి బుద్ధ భగవానుడు మజిలీలమీద మల్లులకు చెందిన కుసీనగరం చేరుకున్నారు. దారిలో 'సావా' అనే చోట 'చుందు' డనే ఒక కమ్మరి ఆతిథ్యం ఆయన స్వీకరించారు. చుందుడు పెట్టిన భోజనం బుద్ధుని దుర్బలమైన శరీరం హరించుకో లేనంత బలమైంది; అయినా - అతని మనస్సు నొప్పించడం ఇష్టంలేక బుద్ధుడు అతడు పెట్టిన పదార్థాలన్ని తిన్నారు. అందువల్ల మళ్ళీ జబ్బు చేసింది. అయినా-ఎలోగో కుసీనగరం చేరుకున్నారు. అక్కడ రెండు మద్ది చెట్ల నీడలో ఆనందుణ్ణి ఒక పరిశుభ్రమైన వస్త్రం పరవ మన్నారు. దాని మీద ఆయన విశ్ర



మించారు. ఆసమయంలో కూడా ఆ మహానీయుణ్ణి సందర్శించడానికి వచ్చిన మల్లి సామంతులను ఆయన కలుసుకున్నారు. వారు వెళ్ళి పోయిన తరువాత మళ్ళీ విశ్రాంతిగా పడుకున్నారు.

సరిగా ఆసమయంలో 'సుబ్బద్దుడు' అనే సన్యాసి వచ్చి తాను బుద్ధ భగవానుని దర్శనం చేసుకోవాలని పట్టు బట్టాడు.

''ఆయన బాగా అలసిపోయారు. విశ్రాంతి తీసుకుంటున్నారు'' అన్నాడు ఆనందుడు.

ఆ మాటలు బుద్ధ భగవానుని చెవిని పడ్డాయి. ఆ సన్న్యాసిని వెంటనే తన వద్దకు తీసుకు రమ్మన్నారు. మరణ శయ్య మీద కూడా భగవానుడు తన ఉపదేశం కోరివచ్చిన వారిని కాదాన లేదు. ఆ సన్న్యాసి ఆయన బోధనలు విని, సంఘంలో చేరాడు. ఆ విధంగా బుద్ధ భగవానుడు తన సంఘంలో చేర్చుకున్న ఆఖరి శిష్యుడు సుబ్భద్దుడు।

క్రమంగా బుద్ధుని పరిస్థితి దిగజారింది. అక్కడ ఉన్న పరివ్రాజకులందరూ ఆయన ప్రక్క చుట్టూ చేరారు. వారికి బుద్ధుడు తన చివరి సందేశం ఇచ్చారు: "చనిపోవడం సర్వ జంతు సహజం। అందుచేత అందరూ మంచిగా జీవించండి।"

ఆ విధంగా బుద్ధ భగవానుడు తన దేహ యాత్ర చాలించి మహాపరి నిర్యాణం పొందారు.

బుద్ధ భగవానుని బోధనలు ఆయనతోనే అంతరించలేదు. ఆయన నిర్వాణానికి పూర్వమే మన దేశంలో వాటికి అధిక ప్రాబల్యం ఏర్పడింది. బుద్ధుడు పరమ పదించి దాదాపు రెండు వేల అయిదు వందల సంవత్సరాలు గడిచినా ఈ రోజున కూడా ఆయన ప్రవర్తింప జేసిన ధర్మచక్రం మన జాతీయ పతాకం మీద ప్రకాశిస్తూంది.

బుద్ధుని మహాపరి నిర్వాణం అనంతరం - ముఖ్యంగా అశోక చక్రవర్తి చేసిన దోహదం వల్ల - ఆయన బోధనలు విదేశాలలో కూడా వ్యాపించ సాగాయి. తూర్పున బర్మా, ఇండో-చైనాలకు ప్రాకాయి. దక్షిణాన శ్రీలంక బౌద్ధమతం అవలంబించింది. క్రమంగా ఉత్తరానా, ఈశాన్యానా టిబెట్, చైనాలకూ, జపాన్‌కూ కూడా బౌద్ధ మతం వ్యాపించింది. అనతి కాలంలోనే వివిధ దేశాలలో ఈ క్రింది 'త్రిరత్నాలు' మారుమోగ సాగాయి :

" బుద్ధం శరణం గచ్ఛామి ।
ధమ్మం శరణం గచ్ఛామి ।
సంఘం శరణం గచ్ఛామి । "

Printed at Pearl Offset Press Pvt. Ltd., Kirti Nagar Indl. Area New Delhi-110 015.

